# అగ్గిరాముఁడు

## రామత్రయము

---

గ్రంథకర్త:

చింతా శంకరదీక్షితులు



ప్రకాశకులు:

కొండపల్లి వీరవెంకయ్యా అండ్ సన్సు

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో

రాజమండ్రి

1948

వెల 1—0—0

రాజమహేంద్రవరము :
శ్రీ కొండపల్లి ముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడియె.

ఆ జి. 14—1000-1946

# అగ్గిరాముడు



"దాసూ! ఏమి మునిగిముసలమ్మవలె కూర్చుండినావు?"

పడకకుర్చీలో కూర్చుండి విశ్వనాథము నారాయణదాసు మనోవికారమును గనిపెట్టెను.

"ఏమి చేయుమనెదవు? మూడుప్రొద్దులును మనమేమిటో! ఈ విశాఖపట్టణపు సముద్రపుగాలియేమిటో! అందులో నీయుద్యోగ నెక్కడకేగినను, నీయంతట నీవే పోవుచుంటివికదా? నాకే యూరకనుండినచో నేమియు తోచుటలేదు."

"ఎక్కడెక్కడనుండియో వచ్చి యీయూరిగాలికై నెలలకు నెలలిక్కడ నెల్లరును మకాము చేయుచుండగా నీకు కష్టముగానున్నదా? తినగా తినగా వెగటైనదట! నాకుమాత్ర మీయూరు విడచుట యనిన నెంతో విచారముగానుండును?

"విశ్వనాథం! దాదాపు ముప్పదియేండ్లు దాటుచున్నవికదా? ఇంతవఱకు దేశ మేమిచూచినట్లు? పట్టుమని విశాఖపట్నముజిల్లానైనను నాలుగుమూలల జూడలేదుకదా? నీకేమిలే తిరుగుచుందువు. వచ్చుచుందువు పోవుచుందువు?"

"అట్లయిన నేమనెదవో చెప్పుము. ఈదినముననే బయలుదేరి పోవుదము; ఎక్కడికో నిర్ణయింపుము. రాత్రికి రైలెక్కుదము. ఇటు బరంపురంవైపు పోవలయుననియున్నదా? లేక గోదావరీ కృష్ణాలవైపు పోదలంచితివా?"

విశ్వనాథం! ఖరారేనా? ఇదిగో నేను తయారే! రాత్రిదాకా కాడ నెందులకు? గోదావరీ కృష్ణాలవైపు పోవుదము. ఒక నెలైనను తిరుగకపోయిన నేను నునిషినిగాను. ఖరారేనా?"

"సరే! సామానుముడిక తయారుచేయుము. రాత్రి బయలు దేరుము. గోదావరిజిల్లాలో నెవరో యగ్గిరాముడున్నాడట! వానికి పోలీసువారు చేతులెత్తి నమస్కరింతురట! వానిదర్శనముగూడ జేసి పోవుదము."

"ఇదిగో మరల వానిదర్శనము వీనిదర్శనమని యచ్చట నొక పదిదినములు నిచ్చట నొక పదిదినములు సాగవలయుననిన నీప్రయాణ మెందులకు?"

"దాసూ! వాడు మనకగుపడియేడిచినాడా యేమి? అప్పటి మాట నాలోచింపవచ్చును. ముందేతగవులా టెందులకు? నీవుపోయి సామాను తయారుచేయుము!

దాసులేచి యింటిలోనికేగెను. అప్పుడే టీ త్రాగి కాలకృత్యము లను దీర్చికొని యిర్వురు నీరీతి సంభాషించికొనిరి. ఉదయ మెనిమిది గంటలాయెను దాసింటిలోని కేగినతర్వాత నేదియో గ్రంథము నొక దానిని గైకొని విశ్వనాథము చదువుకొననారంభించెను. ఇంతలో వీధి యరుగుమీద సడుగులయలికిడి వినబడెను. విశ్వనాథము గ్రంథమును జదువుటమాని వీధిగుమ్మమువైపు జూచెను. విశాఖపట్టణమునకు క్రొత్తగా నారునెలలక్రిందట బదిలీకాబడిన పోలీసు సబిన్స్పెక్టరు కొండల రావాతని కంటబడెను. ఆతడును తన బైసికిలును, వీధియరుగుపై పెట్టి లోనికరుదెంచి విశ్వనాథమునకు నమస్కారముజేసి యొకకుర్చిలో కూర్చుండెను.

"ఏమండోయి! కొండలరావుగారు! మహాత్ములూరకేరారు. మరల నేమైన సాకొంపమీదికి తెచ్చిరాయేమి? అనడుమ వచ్చును గనుగొనునప్పటికి నాకాసాలదరినవి."

"విశ్వనాథముగారన్న సామాన్యులా? ఊసాగి నావ్యవహార మేమియు లేదు కొంచెము వేఱువిషయము మాటలాడవలయునని వచ్చినాను."

"మీపనియైనవెంటనే తిరిగి మాముఖమైన జూడరుకదా? ఏమండీ! అనిన పనితొందర యనెదరు ఉద్యోగిముతీరనికొంత, ఆరు నెలలమధ్య తమ దర్శనము తిరిగిలేదు ఈనాడు నిశ్చిపై కేదియో తిరిగి తెచ్చుటకే యీదర్శనము."

కొండలరావు కొంచెము చిన్నపుచ్చుకొనెను. విశ్వనాథమది గ్రహించి "కొండలరావుగారు! కోపమువలదు ఇవన్నియు వేళా కోళపుమాటలే. మఱిమీరుగరుడెంచిన పని నెఱిగింపుడు, ఈరాత్రి బయలుదేరి, గోదావరి కృష్ణాలవైపు పోవలయునని నేనును దానును, నిశ్చయించుకొనినాము అవసరమైనచో మీపని చూచియే పోయె దను"—అనెను.

"నాపనిపై గాదని చెప్పితినిగదా? మీరు పోదలంచిన దిక్కుననే ఆపని. కాకినాడలో నబిన్నిపెక్కరు సుబ్బారావుగారి నెఱుగుదురా?"

"అయ్యో! మూడేండ్లు దాదాపుకలసి చదివికొంటిమి. ఇప్పు డాయన యుండునది కాకినాడలోనా?"

"ఔను. ఆయనకేదో గట్టిచిక్కు వచ్చినది. ఏదోవ్యవహార మున దొందరకలిగినది నా పేర వ్రాయగా నేను మీ రిచ్చుటనేయున్నా రని వ్రాసితిని. ఇదిగో తిరిగి యుత్తరము వ్రాసినారు. మీతో

మాట్లాడుమని వ్రాసినారు” అని కొండలరావు తన జేబులోనుండి యొక కవరుత్తరము దీసి విశ్వనాథమున కొసగెను. విశ్వనాథ మూ యుత్తర మిట్లు చదువనారంభించెను.

డిసెంబరు 8—1900
కాకినాడ

ప్రియమిత్రుని కొండలరావును దీవించి, సుబ్బారావు వ్రాయు నది. నీవు వ్రాసిన యుత్తరమందినది నా చిన్ననాటి స్నేహితుడు విశ్వనాథ మచ్చటనే యున్నాడని విని సంతోషించితిని. ఆతడి విషయ ములో నాకెక్కువ సహాయము చేయుగల్గునని నాగట్టినమ్మకము, వెనుక నీ కాతడుచేసిన సహాయమే నాయభిప్రాయమును బలపఱచుచున్నది. కనుక నీకీయుత్తర మందినతక్షణమే, వానియొద్దకు బోయి వాని సహాయమును నేను యాచించినానని, నాబదులుగ వేడికొని యీక్రింది సంగతులనెల్ల వానికి కెఱుగజెప్పి, వాని సహాయమును సమకూర్ప వలసినది.

ఈచుట్టుప్రక్కల నీమధ్యరోడ్లపై దొంగతనము లెక్కువగా నున్నవి. ఎవరో ముగ్గురు దొంగలు పోగుపడి కొందరు దొంగ లను గుమిగాజేర్చి, యీ చుట్టుప్రక్కల మహాకల్లోలము జేయు చున్నారు వారలలో ముఖ్యుడు అగ్గిరాముడు, మిగిలిన యిద్దరును దొంగరాముడు, బలేరాముడునని పిల్వబడుదురు. ఈరామత్రయ మీ జిల్లానెల్లను గగ్గోలుపెట్టుచున్నది. ఎన్నిసారులు వారిని పట్టుకొనుట కు పోలీసుప్రయత్నించినను, వారు దొరకలేదు. పైపెచ్చు వారలచే పోలీసు చాలాసారులు మోసము నొందినారు ఈ చుట్టుప్రక్కలవా రి భయముచే ప్రయాణముచేయుటకూడ మానినారు. ఈయగ్గిరాము డు చాలబలమును, బలగమును గలవాడు, వానిని పట్టుకొనుట చాల కష్టము, వానిని నెలరోజులలో పట్టుకొనలేకపోయిన యెడల నన్ను,

వస్వాధీనము చేసెదనని సూచనలిచ్చుచుండెనట్లు బెదరించుచున్నాడు. నేనిం కొక పదిహేనుదినములు లెక్కవగసువు కోరినాను, అతడియ్యకొననే కాని, నేటికిరువదియైదుదినములైనను, నేను వానిని పట్టుకొనలేక పోయినాను. ప్రాణము భీతిజెందుచున్నది. నిష్కారణముగా నుద్యోగము నెరవుకావలసినదేమో తెలియదు ఇంక నిరువదిదినములున్న కాని, వారలనుపట్టుకొనగలనని, నాకేవిధమైన నమ్మకమును లేదు. విశ్వనాథముగారు నన్ను రక్షించి నాతిండి నిలిపెదరేమో వేడుకొను చున్నాను. అతిజరుగురు ఎట్లైనను, వారిసహాయమును యాచించుచున్న నన్ను బాగుచేయుభారమువారిది అతిజరుగురు. తత్క్షణమే వారి సమాధానమును వ్రాయవలయును.

ఇట్లు నీప్రియమిత్రుడు,

ఆర్. సుబ్బారావు.

విశ్వనాథమాయుత్తరమును తిరిగి కవరులోనుంచి, కొండల రావున కొసంగెను.

"అయ్యా! నేను సిద్ధముగానే యున్నాను. ఎట్లైనను నేటి రాత్రి ప్రయాణమనుకొనినదే! కాకినాడలో నీవ్యవహారమును జూచి, తిరిగి బయలుదేరెదను; మీరువ్రాయుడు. నేనునువ్రాసెదను; పాప మాతడు చాలచిక్కులలోనున్నాడు. నాసాధ్యమైనంత సహాయము చేసెదను"

వీధిలో "విశ్వనాథముగారు!" అని యొకకేకవైచిరి. విశ్వనాథ మామనుజుని లోనికిరమ్మనెను. అతడు టెలిగ్రాము బంట్రోతు. అతడు విశ్వనాథముచేతి కొకటెలిగ్రాము నీయగా నాతడు దానిని విప్పి యిట్లుచదివెను.

నలువు, తిరిగినమీసములు, పెచ్చుపెరిగినజుట్టు, కోలమొగము తిరిగిన గండలు, వా డగ్గిరామునితో తులయగు చేయియుందురు."

"వీరిలో నెవ్వానినైన మీరెన్నడైన చూచినారా?"

"సేనానాయకుడు లొకటిరెండు పర్యాయములు కనబడిరి కాని, చేతికక్కకుండ దాటిపోయినారు."

"అగ్గిరాముఁ డెప్పుడైన మీకు దర్శనమిచ్చినాడా? వా డెట్లుండును? వీరిద్దరిలో నొకఁడేనా యేమి?"

"వానిని నేనెప్పుడును జూడలేదు. ఇరువదిదినములనుండి వెదుకుచుండఁగా, నాకు వానిదర్శనమైన లభించినదికాదు. ఒకరోజున మండపేట సమీపమున నాతని చూచెడివాఁడనే కాని, యేకారణముననో విడిచి పోయినాఁడు. ఎవరో కనిస్టేబులు లొకటిరెండు పర్యాయములు వానిని చూచినారఁట; వారాతని యిట్లు వర్ణించియున్నారు. చామనచాయగల దేహము, గుండ్రని మొగము, వాఁడి మీసములు, నుంగరములజుట్టు, కొంచెము పెద్దనేత్రములును గలవాఁడట. ఆతని హస్తమునందు సర్వదా చేతికి సరిపడిన చిన్న బాకుదకత్రయుండునట. అదియే వాని సహజాయుధము! ములనప్పుడును పిస్తోలును గత్తియు నుండునట! సాధువులన్న పరమ భక్తియట విన్నారా?"

"ఆహా! ఆమాత్ర మున్నదికదా! ఫరవాలేదు. సుబ్బారావు గారూ! వాడు తఱచుగా నేరోడ్డుపై నుండును? వాని దొంగతనములు సాధారణముగా నేరోడ్డుపై జరుగుచుండును?"

"వానికొకరోడ్డనిలేదు. రోడ్లన్నియు వాని యధీనములోనివే! ఐనను వానికి ద్వారపూడి, మండపేట, రామచంద్రపురము రోడ్లపై నెక్కువ యభిమానమని యందురు"

"వినలేదు. నిన్న చెప్పెదనని చెప్పితివికావు. పోనిమ్మా వేళ నైన చెప్పెదవా ? నమ్మెదవో లేదా కాని, ఆమధ్య కిర్లంపూడి ప్రయాణము నేనీ భయముచేతనే మానినాను. ప్రకాశం ! సీతా రామయ్యగారి సంగతేమిటి ? ఎవరాయన ? తీరుబడిగా, నీవేళనైనను చెప్పి పొమ్మా"

"కాకినాడప్లీడరు సీతారామయ్యగారి నెఱుగవా ? చెప్పెద వినుము. ఆయన కడసారి యింటిగా కేసో కేసులో పెద్దాపురం కోర్టుకు పోయినారట సాయంకాలము కాకినాడ బండికేమో ఆయన తిరిగి వచ్చునని అగ్గిరామునకు తెలిసినది. వానికి తెలియని సంగతి లేదు. ఎక్కడ నెవ్వరేవేళకు ప్రయాణమో ఏమాత్రములాభించునో వివర ముగా వానికి ముందె తెలియును. ఎవరో యిద్దఱితో వాడు సీతా రామయ్యగారు వచ్చుమార్గమున నిల్చినాడట చెప్పుట మరచితిని. ఈనడుమ పోంగిరాముడును, బలేరాముడును, వానితో కలియక మండపేటముకాము పెట్టినారట. వారితో పనియుండిన అగ్గిరాము డచ్చటికేగుచుండునట. ఇట్లుండగా సాయంకాలమునకు సీతారామయ్య గారు సైకిలుమీద విసురుగా వచ్చుచుండగా రోడ్డుప్రక్కనున్న యగ్గి రాముడు దారికడ్డయి టక్కున సైకిలాపెనట. ఆపైన ఏమయ్యా ! డబ్బేది ? ఫీజు మాకిచ్చిపొండి ! అన్నాడట అగ్గిరాముడు.

అబ్బే ! నేను డబ్బేమియు తేలేదు. అని ప్లీడరనెను

ఇంతట వానితోనున్న యిర్వురును ప్లీడరు జేబులు వెదుకు చుండగా అగ్గిరాముడు కజ్జినాగమ్మలారా ! ఊరకుండుడు. ఆయనే మర్యాదగా నిచ్చివేయును అని మందలించినాడట ! వీని మర్యాద గాల ! ఏమయ్యా ! మర్యాదగా యిచ్చినమంచిది. ఎక్కడనుండియో పనిమానుకొని సులభముగా దొరకునని నీయొద్దకు వచ్చినాము.

నిష్కారణముగా మనుష్యులను టోపీవేసినావా యేమిటి? నన్నెఱుగుదువా?" అన్నాడట అగ్గిరాముడు.

ఆ ప్లీడరొక అగ్గిరాముడు. ఆడబ్బును పద్దాపురమునుండి తన పేరనే కాకినాడ మనిఆర్డరు పంపితినని చెప్పగా అగ్గిరామున కలవి కాని కోపము జనించెను. "ఏడ్చినట్లేయున్నది. ఇంతదూరము నిష్కారణముగా వచ్చితిమి. ఆబట్టలు విప్పిపొమ్మా" ప్లీడరాలోచించుచుండెను.

ఇంతలో వారిలో నెవడో బైసికిలుగైకొని దానినెక్కుటకై ప్రయత్నించుచుండెను. అగ్గిరాముడు వానినాపి "ఓరి! తెలివి తక్కువవాడా! సైకలుకు నంబరుండును. అది మన కెందులకు? ఇచ్చివేయుము అని వాని వద్దనుండి దానిని దీసికొని ప్లీడరుకిచ్చినాడట. ప్లీడరు సంతోషించి అగ్గిరాముడు! చాలసంతోషమైనది. మీరంతా నాతో రండి. కాకినాడలో బహుమాన మిచ్చెదను." అనెను.

"వచ్చెదము కాని, నన్నెఱుగుదురా? మోసముమాత్రము వలదు." అని బెదరించి వెంటబడినారట. కాకినాడలో వాండ్రకు పిండివంటలు, ఫలహారములు, క్రొత్తచాపులు, తలకొక యెదురూప్యములు బహుమానము! ఇక మజా విను! ఇంకెప్పుడు నాప్లీడరునకు భయములేదు. చీకటిలో ప్రయాణమైనచో తోడుగా సాగనంపును. అగ్గిరాముని జన్మమునకు మర్యాదనూడెను!

"వానిసంగతి తెలిసియే నేను ప్రయాణము మానివేసితిని. ఈరాత్రి కెచ్చటనుండునో తెలిసిన బాగుండును."

"ఎట్లు తెలియును? వానిసంగతికంటె మనసంగతి వానికే ముందుగా తెలియును. సుబ్రహ్మణ్యముగారీ రాత్రి బండ్లు కట్టించు నప్పటి కప్పుడే ఆయనపోవుమార్గమునకు ముప్పది నలుబది మైళ్ళ

దూరమునుండి అగ్గిరాముడు విజయముచేయును. ఆపై న మజా చూచి కొనుము. ఒకతడాఖా తీయకుండ విడిచిపోడు. నీవు లక్షమందిని వెంటబెట్టుకొని పోయినను నీప్రయాణ మాఖరగునప్పటికి నీడబ్బును పెట్టెలును నీయొద్దనుండవు. రాత్రి ప్రయాణములుమాని పగలు బయలు దేరుదమన్నను యింతే!" అని యిర్వురు నేమేమియో లోకాభి రామాయణమును మాట్లాడుకొనుచు నాయరుగుపై కొంతకాలము గూరుచుండి, విడలిపోయిరి.

ఆరుగంటలాయెను. విశ్వనాధము లోనికేగి రాత్రిభోజనమున కుండెదనని గుమాస్తాతో చెప్పి తిరిగి వీధియరుగుమీాద గూర్చుండెను. చీకటివ్యాపించెను. భోజనమునకు లేచువేళవఱకును విశ్వనాధము వీధి యరుగుపై గూర్చుండెను. కాని, విశేషము లేమియు నాతనికి గోచ రింపలేదు. రాత్రి గుమాస్తాగారితో ప్రసంగించి తిరిగి కాకినాడ పోవల యునని నిశ్చయించుకొనెను. ఆరాత్రి భోజనమున కితరబ్రాహ్మణు లెవ్వరును లేకుండుటచే గుమస్తాతో స్వేచ్ఛగా ప్రసంగించుట కతనికవ కాశము కలిగెను. వారికి క్రిందిసంభాషణ జరిగెను.

"ఏమండి కృష్ణయ్యగారు! భోజనముచేసి పెద్దాపురము పోవల యును. కొంచెము దస్తున్నది. ఎంతదూర ముండును? దారి మంచి దేనా?"

"అయ్యా! తమకీప్రాంతము క్రొత్తకాబోలును. నామాట వినుడు. రాత్రులందుమాత్ర మీప్రాంతములు ప్రయాణముజేయుటకన్న బుద్ధితక్కువపనియుండదు. అందును నొంటిగా ప్రయాణ మసలే వలదు."

అట్లనెదరు? దొంగలభయము విశేషముగా నుండునా యే మండి? అట్లయిన బండీ మాట్లాడుకొనియెదను."

"వెఱ్ఱినమ్మకమువలదు. నిష్కారణముగా మోసపోయెదరు. ఈప్రాంతముల నగ్గిరాముడను దొంగలగురు వొకడున్నాడు. వానికి బండ్లున్నను లేకున్నను నొక్కటియే.' పదిబండ్లకొక్కడే ఆపి డబ్బు నూడ్చిపెట్టిపంపించును చాలమంది మోసపోయినారు. తొందరపని యైనను రేపేగవచ్చును."

"ఒకటి రెండు పర్యాయములు వీనిపేరు వింటిని. వాడంతవా డుటండీ! ఈనడుమనేమైన జరిగెనాయేమిటి?"

"ప్రతిరోజు నేదియోయొక రోడ్డున జరుగుచునే యుండును. ఎచ్చట నేవేళకుండునో చెప్పలేము ఈనడుమ నారుబండ్ల కడ్డుబువచ్చి పంద్రెండుగురు మనుష్యులను గోచీగుడ్డలతో సాగనంపినాడు వాడు తలచినచో వెంట నెందరో యుందురు."

"అంత బలగమున్నదా? మొన్న జరిగినసంగతి కొంచెము వివరముగా జెప్పెదరా. వినుటకు కుతూహలముగా నున్నది.

"పోలీసుజవానులు వానికి వంగివంగి సలాములు చేయుదురట ఎన్నాళ్ళనుండియో వానిని పట్టుకొనుటకు పోలీసు విశ్వప్రయత్నము చేయుచున్నారు. కాని, వానిదర్శనమైన గాలేదు. ఇప్పటి కెనమిది దినములక్రిందట రాత్రియందొక కోమటి పెండ్లికిబోయి సంసారము తో తిరిగి వచ్చుచుండెను. చామర్లకోట రైలుస్టేషనున కొక మైలువల మారాత్తుగా నేడుగురు మనుష్యులా బండ్లమీద బడిరట! బండ్లవాం డ్రందరు దిగి వానికి దండములుపెట్టుచు వణకుచుండిరట! అంతట నగ్గి రాముడా సావుకారును బిల్చి సామానులు విడిచిపొండి" అని భయంకరముగా జెప్పినప్పటి కతడు పెట్టెయు బేడకులివిచ్చివై చెనట! బండిలోనున్న దుడ్డు దునుకు దీసికొని కట్టుబట్టలతో సాగనంపినాడట! వాండ్రను చామర్లకోట సమీపమువఱకును సాగనంపి బండ్లకు తానే అద్దెనిచ్చి పంపెనట! చూచితిరా వీనిసరసము?"

విశ్వనాథ మాశ్చర్యమభినయించెను

భోజనమైనతర్వాత విశ్వనాథము గుమాస్తాయొద్దకు బోయి "అయ్యా! కాకినాడలో బంధుగులయింటికిబోయి రేపుదయముననే బయలుదేరి పెద్దాపురమేగెదను." అని శలవుదీసికొని రాత్రి పంద్రెండు గంటలన్నర కాతడు కాకినాడజేరెను. తాను వినినసంగతులన్నియు దానున కారాత్రియే దెలిపి నిద్రబోయెను.

# 4

విశ్వనాథ ముదయముననే నిద్రమేల్కొనుసరి కెవ్వరో పోలీసు జవాను లిర్వురు సుబ్బారావుగారితో మాట్లాడుచుండిరి. వారలసంభాషణవలన గడచినరాత్రియం దెచ్చటనో దొంగతనము జరిగియుండెనని విశ్వనాథము గ్రహించెను.

"రాత్రి పంద్రెండుగంటలు కూడ కాలేదండి! కేకలూరికేవిన బడునప్పటి కూరిలోనుండి పర్వెత్తుకొనివచ్చినాము మెట్టపాలెము వంతెన కొకమైలీవల నదేగోల. అదేగోల! దమ్మిడీకూడ మిగల్ప లేదట!"

"సంగతి నంతయు రిపోర్టులో వ్రాసితివికదా ప్రయాణికుల యొద్ద వాఙ్మూలము పుచ్చుకొంటిరా? అగ్గిరాముడున్నాడని చెప్పిరి కాదా?"

"ఔనండి. మొత్తము పదిమంది ఉన్నారట. అపాయము మాత్ర మెవ్వరికి జరుగలేదట. యజమాని శాస్త్రిగారు కేకలు వేయునప్పటి కగ్గిరాము డాయనగొంతుక నొక్కి దుడ్డుచూపినాడట"

ఇంకముందైనను కొంచెము జాగ్రతగానుండుట మంచిది నిష్కారణముగా చాలమంది మోసమునొందుచున్నారు, తోడుకావలసినచో ఈరాత్రినుండి స్పెషల్ డ్యూటీగా యింకొకయిద్దఱు కనిస్టే

బులను దీసికొనిపోండు. వాండ్రెచ్చటినుండి ప్రయాణము ? ఎందులకు ప్రయాణమై పోవుచున్నారు ? ఏమాత్రము పోయినది ?"

"వారు తాళ్ళరేవు పెండ్లికేమోపోవుచుండిరి. రొఖముమాత్ర మేమియు బోలేదు కాని; తెచ్చిన నగలును బట్టలును పోయినవట."

జవానును లిద్దఱును సలాముజేసిపోయిరి విశ్వనాధము నిద్రలేచె నని గ్రహించి, సుబ్బారావు చిరునగవుతో వాని గదిలో ప్రవేశించెను.

"ఏమండోయి ! తిరిగి యెప్పుడు వచ్చితిరి ? జవానులు చెప్పి నది వింటిరా నిన్న రాత్రి తిరిగి కోరంగిరోడ్డున నెవరో పెండ్లికిపోవు చుండగా, అగ్గిరాముడు మార్గమునందే పెండ్లిచేసి పంపినాడట."

"ఏదో నిద్రమత్తున విన్నాను. సరిగావినలేదు. ఇప్పుడే నిద్ర లేచినది. వెనుకకు రావలసి తిరిగిపోవచ్చునని వచ్చితిని."

"ఐతే వినండి. ఇదిగో రిపోర్టునుండి చదివెదను" అని సుబ్బా రావు తన చేతులోని కాగితమును విప్పి సందర్భానుసారముగా నిట్లు చదివెను

"నిన్న రాత్రి పండ్రెండు గంటలకు కోరంగిలో గస్తీ తిరుగు చుండగా కాకినాడరోడ్డున గొల్లుమని యేడ్పులు వినబడినవి. పరుగు పరుగున మేమిద్దఱము నారోడ్డున బోతిమి. మెట్టపాలెమువంతెనదాటి యొకమైలు రమారమిపోవునప్పటి కచ్చట ముగ్గురు బండివాండ్రును, బండ్లలోని జనమును గోలచేయుచుండిరి. సంగతికనుగొనగా నీక్రింది రీతిని చెప్పిరి — అమాంతముగా పదిమంది బండ్లపై కురికి ఎద్దులను విప్పిరి. అంతట వారిలోకొందరు బండ్లలోని జనమును క్రిందకీడ్చిరి. యజమాని శాస్త్రిగారు కేకవేయునప్పటి కగ్గిరాముడు వానిగొంతుక నొక్కి కత్తిచూపింపగా నాయన యూరకొనెను. దొంగలు పెట్టె బేడ పూర్తిగా తీసికొని పారిపోయినారు మేమెగునప్పటికి వారింకను బండ్లు కట్టుకొనలేదు. తాళ్ళరేవు పెండ్లికి బోవుచున్నారట—"

"వింటిరా విశ్వనాథముగారు! అనుకొనని దారినిగూడ బయలు దేరినాడు. వానిసంగతి త్వరగలో జాగ్రతపెట్టకపోయినచో, కొంప మీదికి రాగలదు గిప్పె మరల నూవరించెండెంచేమి నవారీ చేయునో"

"అంతవఱకు వచ్చిననే కాదూ, వాడేమైన చేయునని భయము? సాధ్యమైనంత త్వరలోనే వానిని బట్టుకొనుటకై ప్రయత్నములు చేసెదను మీరుమాత్రము నిశ్చింతతో నుండుడు"

"మీదయ వల్లను మీకు దొరకెదరన్న నమ్మకము నాకు లేదు. ఏసంగతి? నా కెక్కడ గోడ్డని లేదు. ఎక్కడ నుందురని మనము వెదకుటాడుట!"

"అట్లుకాదు సుబ్బారావుగారు! క్రొత్తసంగతి నా కొకటి తెలిసినది. ఏసంగతి చెప్పెదను అగ్గిరాముడు వేరుగా తిరుగుచున్నా డట! మిగిలిన యిద్దఱును యనగా దొంగరాముడు, బలేరాముడును మండపేట సమీపమున మకాము పట్టిరట! ముగ్గురును గలిసి తిరిగిన చో పట్టుబడెదమని జాగ్రత్త నీయెత్తు నెత్తిరి. ఇది మనకు చాల నుపయోగము. ఆయిద్దఱును పట్టుకొంటిమా, అగ్గిరాముడు సులభముగా మనవలలో పడును."

"ఇదే నిజమైనచో నింకేమికావలయును? మీరీ సంగతి నెచ్చట దెలిసికొంటిరి? మండపేట పోయివచ్చితిరాయేమి?

"లేదండి, సామర్లకోటకేగి వచ్చితిని. ఈ సంగతి నాకచ్చటనే తెలిసినది. అది నిజమేయై యుండును. వాండ్రను బట్టుకొనుట కొకమార్గము పన్నితిని — ఈవేళ కోరంగిపోయి రావలయునని యున్నది. ఇప్పుడే భోజనముజేసి నేనును దానును పోయి వచ్చెదము. రాత్రి బయలుదేరి మండపేట కేగెదము. మీకు భయమేమియును లేదు. సాధ్యమైనంత త్వరలో మీపని నెరవేర్చెదను. ఫెందలకడ

భోజనము పెట్టించిన జాలును. దాసు! లెమ్ము. స్నానము జేయుదము"

ముగ్గురును లోనికేగి స్నానముజేసిరి. భోజనమైన తర్వాత బండి కట్టించుకొని విశ్వనాధగుడును దాసును కోరంగికై బయలు దేరుచుండగా సుబ్బారావు "నేను కూడ మీతో రావలయునని యున్నది. శోధనకై పోయితినని డైరీలో వ్రాసెదను రమ్మనెదరా?" అని యడిగెను.

విశ్వనాధము అంగీకరించెను. మధ్యాహ్నము పండ్రెండుగంటలకు ముగ్గురును దొంగతనము జరిగినస్థలమును జేరిరి. ఎండ తీక్షణముగా లేకుండుటచే వారి కేవిధమైన యాలసటయును లేకుండెను విశ్వనాధము యిద్దఱు కాలిపయముల్కు శోధించుచుండెను. విశ్వనాధము వానిని సమగ్రముగా పరిశీలించెను.

అయ్యా! సుబ్బారావుగారు! దొంగ లీ దారినే సామానుతో పోయియుండురు. ఇదిగో రోడ్డునకు తూర్పుప్రక్కనున్న యీయడుగులజాడ వాండ్రు వచ్చినది పదచిహ్నము లన్నియు స్ఫుటముగనే యున్నవి. ఇదిగో యీదారిని తిరిగి వాండ్రుపోయినారు. సామానుతో బరుగెత్తుటచే కాబోలును మడమలు సరిగా ఆనలేదు. అగ్గిరాము డైదడుగులవాడని చెప్పితిరి కాదూ! ఇదిగో యీ యడుగులు వానివి. ఈ యడుగునకు నాయడుగునకు చూచితిరా దూరము. ఇవి తప్పక వానియడుగులే వానిదెంతపాదమండి! సుమారు పదునొకండంగుళము లుండును."

"వీరభద్రపాదమువలె నున్నదే!" అని సుబ్బారావు నవ్వెను.

"దాసు! బండివానిని పంపించుము. మనమీదారి ననుసరించి పోవుదము. ఏమనెదరు సుబ్బారావుగారు?"

"మీశాలవు కావలసినచో తిరిగి దొరుకునులెండు."

దాను బండివానికద్దెనిచ్చి పంపించి తిరిగి విశ్వనాథమును సుబ్బారావును గలిసికొనెను. ముగ్గురు నాయడుగుల జాడ ననుసరించి పోజొచ్చిరి. ఇట్లు కొంతదూరము పోయిన పిదప దూరముగా డొంకలో నేదియో యొకవస్తువు విశ్వనాథముకంట బడెను. అతడచ్చటికేగి తన చేతికఱ్ఱతో దానిని పైకిలాగెను. అదియొక నల్లనిచేబాడిదకఱ్ఱ. గజము పొడుగున నున్నది. సుమారు పదంగుళముల కైవారము గల్గియున్నది కాని, చివరకొంచెము పగిలియున్నది. విశ్వనాథము దానిని తనచేతి బుచ్చికొని దానును, సుబ్బారావును నిల్చియున్నస్థలమును సమీపము జేరెను.

"ఇదిగోనండోయి మీ అగ్గిరాముని దుడ్డు! చివర పగిలిన దనియో చేతియందు బరువెక్కువగ నుండుటచేతనో కాని, దీనిని వాడుపారవైచినాడు. ఈ దుడ్డును గనుబరచినచో ప్రాణములు మీది కెగసిపోవును." అని చెప్పి పరీక్షార్థము వారల కద్దానిని నొసంగి, ఆయడుగులజాడ ననుసరించి వారితో పోజొచ్చెను.

ఆజాడ గురజనపల్లి యను గ్రామసమీపమువఱకును స్ఫుటముగా కనబడినది కాని యూపైనగుపడుట మానెను. విశ్వనాథ మెంత ప్రయత్నించినను దిరిగి జాడనుదీయలేకపోయెను. బహుశః అగ్గిరాముడాయూరినుండి రాత్రికిరాత్రియే పోయియుండునని నిశ్చయించుకొని గురజనపల్లిలో బండి నొకదానిని మాటలాడుకొని ముగ్గురును సాయంకాల మారుగంటలకు కాకినాడ జేరిరి.

రాత్రి భోజనమొనర్చి సుబ్బారావుతో విశ్వనాథము చాల కాలము మాటలాడి కొన్ని యేర్పాటు లొనరుపని వానిచే వాగ్దానమును పొంది తెల్లవారుఝామునసే దానును లేపి యిరువురును

కలిసి రైలుస్టేసును జేరిరి. ద్వారపూడికి టిక్కెట్టును గొని, తన దుస్తులపెట్టెను దానున కొప్పగించి, జాగ్రతగా కాలువగట్టున నున్న సత్రమున దిగుమని సలహాసొసంగెను. ద్వారపూడిలో దాను దిగునప్పటి కాతనికెందును విశ్వనాథము కనబడలేదు. ఏదియో యోచించుచు, తుదకాతడు సత్రమునుజేరి యచ్చట మకాము జేసెను.

# 5

దా నుదయకృత్యము లను దీర్చికొని విశ్వనాథ మానతి చొప్పున ద్వారపూడియూరిలోనికి బోయెను. ఎక్కడ వినినను, ఎవరుచెప్పినను, పోలీసువారలను చాలకాలమునుండి వేధించుచుండిన ఈరామమూర్తియును చేయు దుర్గయుప్రకరమే ! రాత్రి యేడు గంట లగునప్పటికి విశ్వనాథము తిరిగి దాను గది ప్రవేశించెను.

" దానూ ! జాగ్రతగా నుంటివా ? ఎక్కడకుబోయితి నను కొంటివి ? అప్పటినుండియు నిక్కడనే యుంటివా ? "

" ఇక్కడనే యుండియుంటిని. ద్వారపూడియూరంతయు ప్రదక్షిణము జేసితిని. ఎవ్వరు చెప్పినను నీరలసంగతియే. చాల ఘోరకలిగానున్నది. ఎక్కడ కేగితివి? కూపె నేమైన సంపాదించితివా?"

" కూపీ యేమియు దెలియ లేదు. తిరిగి రాత్రిప్రయాణమై పోవలయును లెమ్ము త్వరగా భోజన మొనర్పవలయును. " ఇరువురును లేచి భోజనమునకు బోయిరి. ఆయిద్దరునుమాత్ర మప్పటికి మండపేట సమీపముననే యున్నట్లు తెలిసినదని విశ్వనాథము దానున కెఱింగించెను.

భోజన మైనతర్వాత విశ్వనాథము తన పెట్టెలోనుండి చిరిగిన బట్ట నొకదాని—బాగుగా మాసినదానిని—కట్టుకొని, అట్టి దానినే చొక్కాయి నొకదానినిధరించి, తన పిస్తోలును గైకొని, దానును జాగ్రత్తగా నుండవలయునని చెప్పి, మాడపేటదారిని బయలుదేరి పోయెను. రాత్రి 10 గంటల కాతడు మాడపేటవంతెనజేరి, దాని కావలగా రెండుఫర్లాంగుల దూరమున; చెట్లచాటునడాగి, తన పిస్తోలును చేతికందునట్లు మొలయందమర్చుకొని, వేచియుండెను. తెలుచుగా దొంగతనము లాప్రాంతముల జరుగుచుండునని విశ్వనాథము వినియుండుటచే కాబోలు నాతి ప్రాంతములనే వేచియుండుటకై నిశ్చయించుకొనెను.

రాత్రి పండ్రెండుగంట లాయెను. తనవెనుకనుండి పిల్లకాలువను దగి ఎవ్వరో ఐదుగురుమనుష్యులు వచ్చుచున్నట్లు విశ్వనాథము గుర్తించెను. ఆయైదుగురిలో వెనుక తాను వినియున్న వర్ణనలనుబట్టి విశ్వనాథము దొంగరాముని బలేరాముని సులభముగా గ్రహింపగలైను! అక్కడనే దాగియుండుట శ్రేయస్కరము కాదని తలంచి, విశ్వనాథ మీవలకువచ్చి రోడ్డుపై నిలిచి, జాగ్రతగా నిల్చియుండెను వీనిని చూచి, కొంచెము సాశయించి తిరిగి తమలోతా మేదియో గుసగుస లాడికొని, ఆయైదుగురును రోడ్డుపై కరుదెంచిరి. అందొక్కడు వీనిని జేరవచ్చి "నీవెవ్వడవు?" అని ప్రశ్నించెను. "నే నెవ్వడనైన నేమి? మీరు మిత్రులా లేక శత్రులా?" అని విశ్వనాథము వారి మొగములను బరికించుచు బల్కెను

దొంగరాముడు మూడడుగులు ముందునకువచ్చి, విశ్వనాథ మును తేరిజూచి, "మేము మిత్రులమో, శత్రులమో నీవే నిర్ణ

యించవలయును. ఇదివఱ కెన్నడును, నిన్ను జూచియుండలేదు" అనెను.

"అట్లయిన చెప్పెద వినుము. నే నిచ్చటి కగ్గిరాముని దండులో చేరవలయునని వచ్చితిని. నాకాపురము చామర్లకోట. ఎన్నినాళ్ళు తిరిగినను, నా కగ్గిరాముడు కనబడలేదు. ఇక్కడ నుండునని తెలిసి యిచ్చటకు వచ్చితిని. ఇందులో అగ్గిరాముడెవ్వరు?"

ఈపల్కులువిని, వారింక దూరముగానేగి, తమలో గుసగుసలాడుకొనిరి. తిరిగి వానిని సమీపించి, "నీ పేరెవరు? నీ కగ్గిరాము డెందులకు?" అని వారలలో నొకడు ప్రశ్నించెను.

"నాపేరు విస్సిగాడు. నే [illegible] తినుటకు తిండిలేక, పొట్టకై అగ్గిరామునితో కలియవలయునని బయలుదేరి వచ్చితిని. అగ్గిరాము డెవ్వరు?"

"అగ్గిరాముడు లేడిక్కడ, ఎక్కడ నున్నాడో మాకు తెలియదు. నీదారిని పొమ్ము" అని [illegible]రాముడు వానికి దారిని జూపెను.

"అగ్గిరాముడు లేకపోయిన వాని స్నేహితు లున్నారట— రంగరాముడు, బలీరాముడు అని వాని స్నేహితు లిక్కడ నెక్కడనో యున్నారట. వారలజాడ చెప్పినను సరే, వారికాళ్ళపైబడి బ్రతిమాలుకొనెదను. బాబూ! తినుటకులేదు. పొట్టను చేతితో పట్టుకొని తిరగవలసినది. ఆనంగతినైన చెప్పరా?"

అగ్గిరాము డాగుంపులో లేడని విశ్వనాథ మెఱుంగును. ఆతని మాటలకు వారెల్లరును నవ్విరి. తిరిగి కొంతదూరము వెనుకకు బోయి, వారలలో నిద్దరు గుసగుస లాడి, విశ్వనాథము చెంతకుబోయి "విస్సిగా! నీ వేమిచేయగలవు? వాంఛించునది నీకు గావలయును?" అని విశ్వనాథము దేహమును బరీక్షించుటకు కాబో

లును, వానిభుజముపై దొంగరాముడు చేయివైచెను. ఆచేతిని విదళించుకొని, విశ్వనాథము, "వాండ్రను బ్రతిమాలుకొనినచో, నాకు తిండి పెట్టెదరని నమ్మకముండి వచ్చితిని. వాండ్రలో కలిసి నేను గూడ దొంగతనములు చేయుటకు బోయెదను. వాండ్రెక్కడ నున్నారు?" అని పల్కెను.

దొంగరాముని మొగము జూచిన, విశ్వనాథము చెప్పిన మాట లోతునకి వచ్చు లేదనియు నేదియో ననుమాన మున్నట్లు గ్రహింపవచ్చును. ఈ మున నీమధ్య వారలను బట్టుకొనుటకు పోలీసువారహోరాత్రములు ప్రయత్నములు చేయుచుండిరికదా? ఈ తడు వారలలో వాడేల కాకూడదు? అందులో నొక్కని దూరముగా బిల్చి దొంగరాము డేమియో మాట్లాడుచుండెను. దొంగరాముడు స్ఫురద్రూపి యని విశ్వనాథము గ్రహించెను.

ఐదునిమిషములైన తర్వాత వారిద్దరును తామున్న తావునకు మిగిలిన పుగ్గురును బిలిచికొనిపోయిరి. తిరిగి కొంతకాలమునకు గుసగుస లాడిన తర్వాత వారందరును హఠాత్తుగా వచ్చి విశ్వనాథముపై నురికిరి. విశ్వనాథ మిట్లుజరుగునని యింతకుబూర్వమే గ్రహింపగల్గెను కాన, ఎక్కువనేర్పుతో వారలను తప్పించుకొని, తన మొలనున్న పిస్తోలును పైకిదీసెను. దొంగరాముడు వానిని జూచి,

"ఒరే బలేరామ్! పోలీసువెధవే! పోనీయక పట్టుకొనుడు" అని కేకవైచెను. విశ్వనాథము తన్ను వీరలు గుర్తించి, తనకార్యములు గ్రహించితిరాయని యనుమానించి ఏమైనను బరిశీలింపవలయునని, నిబ్బరమును దెచ్చుకొని,

"ఉన్నస్థలమునుండి కదలబోకుడు! మోసము జాగిలదు! నేను పోలిసువాడను కాను. నేను మీలోవాడనే; నన్ను పోలీసు వెధవలు తరుముచు వచ్చుటచే పారిపోయి వచ్చితిని. నన్ను వారు

మీలోవాడ ననుకొన్నారు. నేను పోలీసువాడను కాను; నిష్కారణ ముగా నన్ను బాధించినచో, ఇదిగో నాచేత పిస్తోలున్నది. నా మాట నమ్ముడు ! ” అని విశ్వనాధము భయంకరముగా నరచెను.

వాని వాక్యములకు దొంగరాముడించుక సంతుష్టుడై, మాకు నమ్మక మేమిటి? మా సంగతి నెరుంగుదువా? మోసముచేసితివేని గుండె పగులదన్నదను. అని విశ్వనాధమును సమీపించుచు పల్కెను.

ఎన్ని దినములనుండి మిమ్ములను పట్టుకొనుటకై పోలీసువారు ప్రయత్నము జేయుచున్నారు? మీ రేమైన దొరికినారా? మీ రున్న స్థలమైన దెలిసినదా? నాకలా మిమ్ములను పట్టుకొనుట ! నామాట నమ్మకముండిన నామాట వినుడి; చెప్పెదను. దొంగయునికి తెలిసి కొనుట దొంగకే సాధ్యము. అందుచేతనే మీరిచ్చట దొరుకుదురని ధైర్యముగా నిచ్చటకు వచ్చినాను. ఈమాత్రము తెలివితేటలు పోలీసు వారికేయున్న యెడల మనల నెంగటనో పాటికి హతమార్చరా? ఇప్పటికైన నామాట నమ్మక మున్నదా? అని విశ్వనాధము పలికెను.

దొంగరాముడు వానిని సమీపించి భుజముపై చేయివైచి “అన్నా ! విన్నన్నా ! నమ్మకము లేకేమి? నీవు పోలీసువాడ వని నాకిప్పుడును నమ్మకము లేదు. ఏమాత్రము బలమైనవాడవో చూడ వలయునని అట్లుచేసితిని. కోపము నొందవలదు. మన మెల్లరము నొక జాతివారమేసుమీ ! నాకు సంతుష్టి గలుగజేసితివి. నీ నివాసం బెక్కడ నుందువు ? ” అని ఆదరణతో పల్కెను.

అన్నా ! నాకు కొంపలేదు. మీతో కలిసి యుండెదను. ఇప్పుడు తిరిగి నాయూరికేగి తిరిగి రేపురాత్రి వచ్చి యిచ్చటనే

మిమ్ములను గలిసికొనెదను ముద్దాకునుకూ తెచ్చుకొనెదను. బాగుగా నమ్మకము కుదిరినదా ? ఇంకేమైన ననుమాన మున్నదా ?

ఏవిధమైన అనుమానమును లేదు. ఎందుల కుండవలయును ? జరిగినదానిని మరచిపోవలయును మనమామాత్రము జాగ్రతగా లేకున్న మోసము జరుగదా ? మనసంగతి యటువంటిది బోధపడినదా ?

పోనాను. మఠి నాకు శల వొసంగినచో పోయి రేపురాత్రికి వచ్చెదను. నన్నెవరయిన నిచ్చట గలిసికొనిన చాలును. మీ యింటికి వచ్చెదను. చిన్నబట్టలమూట మాత్రముండును.

నేనే కలిసికొనెదను లెమ్ము వీడిని చూచితివా ? వీడే బలేరాముడు. బలేరాముడు పల్లికిలించెను.

అట్లా ? రేపటినుండి అంతయు మనమేకదా ? శలవిచ్చిన పోయెదను చాలదూరము పోవలయును.

సరేపొమ్ము రేపీవేళ కిక్కడనే యుండెదను. తాను వచ్చిన దారినే విశ్వనాథము పోయెను. మంగపేటవంతెన సమీపమున నేదియో యూల వినబడుటచే నాతడు వెనుదిరిగి చూచి వడిగా నడువసాగెను. వానివెంబడి నెవ్వరును వచ్చుచున్న ట్లాతనికి గనబడలేదు. వారి కేవిధమైన యనుమానమును లేదని తలంచి విశ్వనాథము తెల్లవారుఝామున ద్వారపూడిసత్రమున జేరి దానును లేపి తనగది ప్రవేశించెను.

## 6

నాల్గుదిక్కులను కలియజూచి, వెన్నంటి యెవ్వరును రాలేదని నిశ్చయించికొని, తనగది ప్రవేశించినంతనే విశ్వనాథ మొక పెద్దనవ్వు నవ్వెను.

"దానూ! లేచి, దొంగ, అని కేకవై చెదవేమో, నేను విశ్వనాథమును. సమ్మకమున్నదా?" దాను విరగబడి నవ్వుచుండెను.

"ఏమైనా కూపీ లాగితివా యేమి? నీసంగతి జూచినట్లే బోధపడుచున్నది" విశ్వనాథము తనవేషమును పొదుపుగా తీసి దాచి, తన మామూలువేషమును ధరించెను.

"దానూ! దర్శనమైనదోయి!" అని తనచర్య నంతయు నవిస్తరముగా విశ్వనాథ మెఱింగించెను. తరువాత నాతడు మంగలి నొక్కనిని బిలిపించి, తనకేశములను దగ్గరగా కత్తెర వేయించెను. తిరిగి సాయంకాలమునకు యధాప్రకారముగా మాసినగుడ్డలను ధరించి, తాను ధరించియున్న గుడ్డలకుతోడుయగు కొన్నింటిని మూటగాగట్టుకొని, పిస్తోలును మొలయ దనుర్చుకొని ప్రయాణసన్నాహ మంతయు గావించెను.

"దానూ! తిరిగి నేను పోవుచున్నాను. బహుశః ఈసారి మూడు నాలుగు దినములు కూడ కావచ్చును. నేను రాలేదని నీ వేమియు కంగారుపడవలదు. నేను చెప్పినసంగతులన్నియు సుబ్బారావు గారి పేర వ్రాసి తగినయేర్పాటులు గావింపవలసినదని తెలియజేయుము జరిగిన చర్యనంతయు వ్రాయువలదు" అని కొంతసేపాతనితో గుసగుసలాడి విశ్వనాథము నాలుగుదిక్కులను బరీక్షించి, యెవ్వరును లేరని నిశ్చయించుకొని, వడివడిగా మండపేటదారిని బోయెను. రాత్రిగాఢాంధకారముగా నుండెను. ఆకాశము మేఘమయమై యుండెను. సరిగా దారికూడ కనబడుటలేదు అట్టికటికచీకటిలో నర్ధరాత్రియందు దామండపేటకు బోవురోడ్డున కొంచెము నర్తించిన తర్వాత నడచుట యెంత కష్టమో ఆమార్గమున బోయెడు వారికే తెలియగలదు. కాని విశ్వ

నాథ మిట్టి విషమదశలయందుగాని తొట్రుపడడనియు, చీకటిలోనైనను; 50 గజముల దూరముననున్న వస్తువులను గుర్తింపగలడనియు మా వారకు తెలిసిన యంశమే. అందుచే నాతనికి విశేషకష్టమేమియు దోచలేదు. అంతియేకాక తానొక్కజోవు దుర్ణయమునకు సరియగు కాలమిదియే యని మహోత్సాహము నొందెను. రాత్రి పదిగంటల కాతడు తాను వెనుకటిరాత్రి దాగియుండిన స్థలమునుజేరి చెల్లుచాటున నిల్చియుండెను. అతనికొఱకై వేచియుండిన దొంగరాము డిరువది గజముల దూరముననుండి, యాతని నిట్లు పలుకరించెను.

“విశ్వనాథా! వచ్చితివా? బట్టలమూట దెచ్చికొంటివా? సరే! ఈపిల్లకాలువ దిగిరమ్ము కొంచెము పనియున్నది”

“తెచ్చుకొంటిని, ఏమిపనియున్నది?”

“కాలువదిగి రమ్ము త్వరగా పోవలయును ఆలస్యమైనచో, మనవాండ్రు తగులబెట్టెదరు. ఆపైన కొంప మునుగగలదు!”

విశ్వనాథుని దీసికొని, దొంగరాముడు పిల్లకాలువగట్టుపై బడిపోవుచు తన తొందరకు నీ రీతిని జెప్పసాగెను.

“ఈరాత్రి కాకినాడనుండి యొకవర్తకుడు రెండువేలరూపాయిల దస్తుతో రామచంద్రపురము వచ్చుచున్నాడు. రాత్రి తొమ్మిది గంటలకు బయలుదేరినాడట. తెల్లవారుఝామునకు రామచంద్రపురము జేరగలడు. మనముందు గురువంతెనకు రెండుమైళ్ళవల వాని తాళము పట్టవలయును అగ్గిరాముడే స్వయముగా కబురంపినాడు. అతడు రేపు రాత్రి మనమఠమునకు వచ్చునట, మనవాండ్రందరును నచ్చటకేగి కాచుకొనియున్నారు వాండ్రున్నస్థలమునకు బండిమూడుగంటలకురాగలదు ఇప్పుడు పదునొకండు గంటలైనదికదా మనమచ్చటకు రెండు గంటలలోగా పోవలయును త్వరగాపోవలయును” అని తనకంటె

వినుదుగా నడచుచున్న విశ్వనాథముతో దొంగరాముడు నడువ జొచ్చెను.

ఆవెనుకటిరాత్రి లక్ష్మణుడు నంటి రాలేదని విశ్వనాథము సంతోషించెనేకాని, యాతనికా గుంపులో సిలువడదొరికిన తర్వాతననగా మరునాటి సాయంకాలము దొంగరాముడు చెప్పినసంగతుల నెల్ల విని విశ్వనాథము తనకు గర్వభంగమాయెనని అనుకొనుటయే గాక తానిక ముందతిజాగరూకతతో మెలగవలయునని యాలోచించెను. విశ్వనాథము వెంటబడి దొంగరాముడు పిల్లకాలునడకతోనాతనికి స్వల్ప దూరముననే నడువ నారంభించెనట! దొంగరాముడనకింకను ననుమాన ముండుటచే, నితడు యుండదు పేట పోలీసుశాఖసేవుల కేమైన వార్త నంపు నేమోయని నిరాకరించి వెంబడించెనట. కాని విశ్వనాథ మిటునటు జూడక తిన్నగా గోష్ఠిన బోవుచుండుటచే నాతని యనుమాన మించుక సడలిపోయెను. కాని, తాపేశ్వరముపటుకును బోవ నిశ్చయించుకొని యొకఫర్లాంగు దూరము వెనుకనుండి కలవెంచెనట! అది విని విశ్వనాథము మరింత వడిగా నడచుటచే, దొంగరాముని యనుమానము తీరిపోవ నాయను తిరిగిపోయెనట తాతకు డగ్గులు నేర్పవలయునా? తుదకు దొంగరాముడింటికిబోయి తన కూటములో వారితో తనసందేహము తీరినదని చెప్పెను.

రాత్రి రెండుగంటలకు విరిద్దరును సంకేతస్థలమును జేరిరి. బలేరాముడు విశ్వనాథమును జూచి తన సంతోషమును వెల్లడించుట కున్నై యొకసారి కొంచెము బిగ్గరగా నకిలించెను. ఆతర్వాత బందిపోటు ప్రయత్నములన్నియు జేయబడెను. విశ్వనాథము బలేరాముడును బండి తమస్థానమును జేరినంతనే చెరియొక యిద్దును విప్పివేయవలయుననియు దొంగరాముడు బండివానిని క్రిందకులాగి నోటగుడ్డలు గ్రుక్క వలయు

నవియు, మిగిలినవారందఱును, బండిలోనివారు (ముగ్గురుందురని కబురు తెలిసినది) పారిపోకుండ కావవలయుననియు, పై ముగ్గురును తమతమకార్యములను నిర్వర్తించినతర్వాత బండిలోనివారలను గట్టివైచి రోడ్డుప్రక్క బడవైచి దస్తుండిన ట్రంకుపెట్టెను మోసికొని అంచీల మీాద మండపేట సమీాపముననున్న స్వస్థానమును జేరవలసినదనియు, నేర్పాటులు గావింపబడెను. బండికి రెండును తెల్ల యెద్దులన్నియు, గూడునకు బైన తారుగుడ్డ యుండుననియు, యెద్దుల మెడలలో గంటలుండుననియు, తెలియజేయబడెను. ఇంకొక పావుగంటలో, ఉండూరువంతెనయొద్ద కంపెనీచేసిన సీత్రింపడరు దించి, బండి యొక్క-టియే వచ్చుచున్నదనియు, ఇంకొక గారగంటలో నాతావును జేరగలదనియు, జెప్పెను. అందఱును జాగరూకులై యుండిరి.

బండి సంకేతస్థలమును జేరెను. మాటునడాగియున్న సింహములవలె ముగ్గురును బండి నాపివైచి తమతమ పనులను గావించిరి. బండిలో ముగ్గురేయుండిరి. వాండ్రడ్రకోట గుడ్డలుగ్రుక్కి బండివానితో బాటుగా రోడ్డుప్రక్కను బడవైచిరి. ట్రంకుపెట్టెను బట్టుకొని ప్రక్కదారిని మండపేటవైపు పందఱును బర్వెత్తజొచ్చిరి. విశ్వనాథము మాత్రము బండిలోని మనుష్యులను బంధించుటయందు దొంగలకు మిగిలినవారాపనిని జేయుచుండగా తాను బండిలోనుండి ట్రంకునులాగి రోడ్డుపై బడవైచెను మార్గమధ్యమున విశ్వనాథముకూడ కొంతవఱ కాపెట్టెను మోయవలసి వచ్చెను. దొంగరాముడు దాయమునకున్న వానితోకూడ పర్వెత్తి ఎక్కువనేర్పుతో తనకార్యము నెరవేర్చెనని విశ్వనాథమును స్తుతింపసాగెను. తూర్పునను తెల్లవారకపూర్వమే వీరందఱును తమనివాసస్థానమును జేరిరి. మండపేటకు గొంతిదూరమున నున్న పిడపర్తిగ్రామమున వీరు నివాసమేర్పఱచుకొనిరి వీరు మూల

గూడెమున నొక తాటాకుల గుడిసెయందు వసించుచుండిరి. తమబరువునుదించి లోపలిగదియందుంచి తాళమువేచి యందఱును ముందుగదిలో పఱచియుంచబడిన చాపలపైన బరుండిరి. ఏదేదియో యిష్టాగోష్ఠిని మాట్లాడుకొనుచు వారందఱును లోకమంతయు మేల్కొనుసరికి నిద్రబోయిరి.

## 7

మధ్యాహ్నము 2 గంటలకు క్రమక్రమముగా వారందఱును నిద్రలేచి, స్నానముజేసినవారు స్నానముజేయగా భోజనములజేసి గుడిసెలో కూర్చుండి యుండిరి ఆ గుడిసె సంగతి వర్ణింపవలయును.

గుడిసెకు నాల్గువైపుల నత్తయిన తాటాకువడు లున్నవి. లోపలి యావరణలో రెండు మామిడిచెట్లును, ఒకయుసిరి వృక్షమును రెండు కొబ్బరిచెట్లును, ఏడెనిమిది తాటిమొక్కలును, కుంకుడుచెట్టొకటియునున్నవి. గృహమంత గుంభనగా పైకగుపించదు కాని లోపల నతివిశాలముగ నుండెను. గృహమంత రెండుగదులుగా విభజింపబడి యుండెను. ఇంటివెనుక నొకవసారా యుండెను. ఆవసారాయం దందఱును వంటజేసికొనుచుందురు. ఆ గదులలో నొకదానియందు వారెల్లరును తమసామానుల నుంచుకొని రెండవదానియందు శయనింతురు. విశ్వనాధ మాదినము నందఱును భోజనము జేయువఱకును నిద్రలేవక, ఏదియో మిషబెట్టి వేఱుగా వండుకొని భుజించెను.

రాత్రిపదుమవఱకును వీరెల్లరును తమగుడిసెచెంతనే కూర్చుండి యుండిరి. (ఆకాలమునందే దొంగరాముడు విశ్వనాధమును వెంబడించినగాధ నాతనితో చెప్పెను) అగ్గిరాముడాదినమున తమ్మెల్లరను

జూడవచ్చునని కాబోలును వారెల్లరును సుత్సాహవంతులై యుండిరి. అచ్చట జేరియున్న గుంపులో దొంగరాముడును, బలేరాముడును, విశ్వనాధమును గాక ఇంకొక యేబదుగురు మనుష్యు లుండిరి. వారిలో కొందఱు విశ్వనాధమును మండపేటసమీపమున జూచినవారును మఱి కొందఱు రామచంద్రపురమునకావల దొంగతన మొనర్చినవారును గలరు. ఇంతలో బలేరాము డికిలించుచు లేచి, వారల కిట్లుపన్యసింప నారంభించెను.

"అన్నలారా! తమ్ములారా! మనమెల్లరము నొకరీతిగా నుద్యోగస్థులమే అనుకొనియెదముగాక! మనయధికారి వచ్చినప్పుడేవిధముగా మనము సంచరింపవలయునో ఆరీతిగనే మనమేలు గోరుచు బీదసాదలకు సమానత్వమును జేకూర్చుటకై యత్నించుచున్న మన నాయకుఁడు మనల జూడవచ్చినప్పు డదేరీతిగా సంచరింపవలయును. అగ్గిరాము డగ్గిరాము డనుకొనుటయే కాని నాకును దొంగరామునికిని దప్ప మీకెవ్వరికిని వానిసామర్థ్యాదులు తెలియవు. కొంచెమాతని శక్తినిగుఱించి చెప్పెదను. అతనియాకారమును జూచినంతనే యాతని దేహదార్ఢ్యము మనకంతగా బోధపడదు ఆతనినుగుణాలి జగ్గి జూచినచో నాతడు పేరుమోసిన దొంగయా యని మీరు సందియముందరు. కఱ్ఱనుగాని, కత్తినిగాని, పుచ్చుకొని సామునారంభించెనేని నూరుమందినైనను అవలీలగా నడ్డగలడు ఆకాలమునందాతని రూపము మెఱపువలె, నెవ్వడైన గనబడునేమో సంశయాస్పదము! బాహాబాహి పెనగనారంభించెనా యాతనితో బోరి నేటివఱకెవ్వరును నగ్గని లోకమున జెప్పుకొనుటలేదు. పిస్తోలుతో లక్ష్యము తప్పకుండ నెంతటిసూక్ష్మవస్తువునైనను మానవసాధ్యమైనంతదూరమునను గొట్టగలడు. అతనితో నెంతవడిగా వెంబడించువాడైనను

పరుగెత్తలేడు ఆతని దేహమునకు ముండ్లునాటవు. అతడు తెలుగు, హిందీ, హిందూస్థానీ భాషలను స్వదేశస్థునివలె, మాటలాడగలడు అరవము, ఇంగ్లీషు, కొంచెముగా మాట్లాడగలడు. ఇక నాతనినుంచి తనము నాతడు దోచినవానికే యొగ్గడించుచుందురు. ఆత డెన్నిసారులు దారులుకొట్టినను నేటివఱకు ప్రాణహానిజేసి యెరుగడు. స్త్రీలను, లేబ్రాయపువారిల నెన్నడును బెదిరించినయైన యెఱుగడు తాను తప్పించుకొనిపోవుటకు వీలులేనప్పుడు మాత్రము కొంచె మెవరివారలను నొప్పించి తనదారి నేగెడువాడే కాని అప్పుడైనను రక్తమును గంటజూచియెఱుగడు. నేటికి సుమారు పదిపండ్రెండేండ్లనుండి యాతడు దొంగతనములు చేయుచున్నను పోలీసు వారింతవఱకు సలాము చేయుచుండుటయేకాని, వానియెదుటబడి పోరాడినవాడు లేడు. ఇట్టిమహానీయుడు మనకు నాయకుడై యుండ మనకేటికొదవ? ఇట్టి దేశోపకారి మనకు గురువై యుండ మనమేల భీతిల్లవలయును? దొంగ దేశోపకారి యెట్లగునందురా? అతడు భాగ్యవంతులనే దోచికొని. బీదవారిని పోషించుచున్నాడు. బీదల కాతడు దైవసమానుడు. సాధారణసంసారుల నాత డెన్నడును బాధించియెరుగడు అతని యద్భుతచర్యల నింకొకసారి చెప్పెదను. అతని దైవభక్తి, దీనసంరక్షణయే, నాతనిని దీర్ఘాయుష్మంతుని జేసి మన్నింపగలవు."

"ఎవరిని దీర్ఘాయుష్మంతునిజేసి మన్నించుట?" అని యొక గంభీరస్వరము గుడిసె వెలుపలనుండి వినబడెను. బలేరాముడు గంతులువైచుచు తలుపుదీయబోయెను. అగ్గిరాముడు లోపల ప్రవేశించెను. గుడిసెలోనున్న వారందరున్ను—విశ్వనాథముకూడ—ఒక్కపెట్టునలేచి "అగ్గిరామ్‌గురోజీకి జయ్" అని కేకలు వైచిరి. కుశల ప్రశ్నములు తీరినతర్వాత దొంగరాముడు విన్నన్న వృత్తాంతమంతయు

దానితో జెప్పెను. అగ్గిరాముడు విశ్వనాథమును జేరి అతని యొద్ద గూర్చుండి వానిముఖమును తీక్ష్ణముగా బరిశీలించి భుజముపై చేయి వైచి నానందముగా.

"విస్సన్నా! దొంగరాముడు చేసినదానికి నేనెన్నడు నడ్డు రాను. నీకేవిధమైననుమానము వలదు. యథేచ్ఛగా నుండవచ్చును, అని ధైర్యము జెప్పెను.

"నేను తిండిలేక మీపాదములపైబడి జీవనోపాధి నేర్పఱచు కొనుటకై వచ్చితిని. మిమ్ములను జూచుట నేటికిగానితటస్థించినదికాదు మీకయి వచ్చిన నాకు మీయనుచరులు స్నేహముముందుగా తటస్థించినది. వీరును మీరును నాయందు జూపిన దయకు నేనెంతయు గృతజ్ఞుడను."

"విస్సన్ననుజూచి మేము మొదట నేమోయనుకొంటిమి. కాని మాకు నామముల బెట్టజాలిన సమర్థుడని మొన్నటి నిన్నటి వ్యవహారములలో తేలినది." అని బలేరాము డికిలించెను.

"విశ్వాసముగా నున్నచో వాని కేవిధమైన హానియు రానేరదు మీవలెనే అతడును నానమ్మినబంటుగా నుండును. నేనిదే అభయ హస్త మిచ్చుచున్నాను." అని అగ్గిరాము డాతనిచేతిలో చేయి వైచెను.

విశ్వనాథము తన సంతోషమును గనబఱచుచు "అగ్గిరాముడు తలచినయెడల లోటేమిరాగలదు! నాకానందమైనది" అనెను.

అగ్గిరాముడు దొంగరాముని నావలకు దీసికొనిపోయి నుమారు నున్నపది హేనునిమిషములవఱకును మాట్లాడి పిదప గుంపువారందఱు

నున్న తావునుజేరి కూర్చుండెను ఒకగంటవఱకును వారెల్లరు నిష్ఠాగోష్ఠి మాట్లాడుకొనుచుండిరి. అగ్గిరాముడు తాను పోవలయునని లేచి ముందు జరుపబోవు దొంగతనములను గుఱించి తనవారికెఱిగింపదలచి యిట్లు పన్యసింపదొడగెను.

"సోదరులారా! నేను చెప్పబోవు సంశయములను జాగరూకులై సావధానముగా విననలయును. మనవృత్తి కొలదిదినములక్రిందటివలె నేడు నిష్కంటకము లేదు. పోలీసు మనవృత్తికి భంగము కలిగింప వలెనని విశ్వప్రయత్నము జేయుచున్నారు వివిధోపాయముల నవలంబించుచున్నారు మనగుంపు కొంతవఱకు వారల యధీనమైనది. కాని నేటివఱకు మాత్రము నాయకులను వారు పట్టుకొనలేకున్నారు భగవదిచ్ఛ యెట్లుండునో మనము చెప్పలేము. సాధ్యమైనంతవఱకు మనము జాగ్రతగానుండుటయే మనకు తరుణోపాయము. మనము వసించియున్న యీమూలకూడెములోనివారెల్లరును మనకు లోబడి యేయున్నారు. మనవలన కొలదిగనో గొప్పగనో వార లనుభవించుచున్నారు. అందుచే వారు మనమున్న తావున్నపై వారి కెఱింగింప నేరరు. వారలట్లు మనకు లోబడి యున్నంత కాలమును, మనము హాయిగా గుండెపై చేయివైచికొని నిద్రింపవచ్చును. కాని రోజు లెట్లుండునో మనము చెప్పనేరము. కారణాంతరములవలన, నేను విడిగా సంచరింపవలసి యున్నది. నేను లేనికాలమున మీరతి జాగరూకులై మెలంగుట శ్రేయస్కరము. మెలగువిధులన్నియు మీరిదివఱ కెఱింగియే యున్నారు. క్రొత్తగాజేరిన విస్సన్నకు దొంగరాము డావిధుల నెఱిగించును. ఇక జరుప దలచిన దొంగతనములను గుఱించి తెలియ జేయుదును. సావధానముగా వినుడు. రేపురాత్రి మీరెల్లరు నవపత్రి లోనొక భాగ్యవంతుని యింట బ్రవేశించి సొత్తును తీసికొని రావల

యును. ఆపైన మంతయు దొంగరామునితో జెప్పితిని! ఆతడు మీా కెఱింగింప గలడు నేనచ్చటకు రావీలులేదు కావున జాగరూకులై మెలంగవలయును. నేడు తదియగదా! తిరిగి షష్ఠిరోజున ద్వారపూడి రోడ్డున రామచంద్రపురము పెండ్లివారు పోయెదరు. సుమారు 10 గంటలకు బండ్లు వంతెనదిగును. వంతెన దిగినవెంటనే మీాపనిమీారు జూచుకొనవలయును. నేనుకూడ బహుశః రావచ్చును. కాని యిన్నిటి కంటెను ముఖ్యమైనది నవమినాటి రాత్రి 12 గంటలకు జరుగవల యున్నది. ఆర్యావట్టములోని క॥ ల॥ ఇంట బ్రవేశించి, సామాను నంతయు తెల్లవారుసరి కిచ్చటకు తీసికొని రావలయును అచ్చటకు నేనును రాగలను ఎల్లుటిరాత్రి నేనొక చిత్రము నాచరించెదను. తరు వాత నయ్యది మీాకెఱింగించెదను. నేను లేనని మాత్రము మీారెంత మాత్రము నధైర్యము నొందవలదు."

పిదప నాతడు దొంగరామునితో వదినిమిషముల వఱకు గుస గుసలనాడి "అగ్గిరామ్ గురోజీకి జయ్" అను శబ్దము మధ్య న్ధంధ కారములో నైక్యమైపోయెను.

# 8

అగ్గిరాముడు గుంపును విడచి యెచ్చటికో పోయెను అతని యునికి దొంగరామునకు దప్ప మఱెవ్వనికి దెలియదు. విశ్వనాధ మగ్గి రాముని జూచినదిమొదల లాతని రూపమునకును, పిదప వానివాక్యముల కును మితిలేని యాశ్చర్యము నొందెను. ఆతని రూపమును జూచినవా రెవ్వరు నాతడు దొంగయనియు, విశేషబలశాలియు దలంచుట కవ కాశములేదు. ఆతని వాక్యములను వినిన నాతడు నీచవృత్తియందు సంచరించువాడని యెవ్వరు ననుకొనరు రాకపోకలయుండలి యాతని

తెలివితేటలను, పన్నుగడల యందలి యాతనినేర్పును వశీకరణమునం దాతని చాకచక్యమునుగని విశ్వనాధుడు తానుకూడ నిజముగ దొంగయై, యగ్గిరాముని యనుచరునిరీతి నుండిన నెట్లుండునోయని చింతింప నారంభించెను. అట్టియసాధారణ ప్రజ్ఞగలవాడు కనుకనే, నేటివఱకు నాతడు పోలీసుచేత బడకుండెననియు, నాతనియునికి పైవారెఱుంగ లేకుండిరనియు విశ్వనాధమూహించెను. అగ్గిరాముడు నిజముగ చోర చక్రవర్తియను బిరుదము కర్హుడే.

ఇట్లుతలంచుచుండిన విశ్వనాధమును దొంగరాముడు సమీపించి ఏమోయి! జోగుచుంటివా ?" అని కండ్లయెదుట జప్పట్లుచరచెను. విశ్వనాధ ములికిపడిలేచి "గురుదర్శనానందము ననుభవించుచుంటిని" అనెను.

విన్నావా! నీసంగతి అగ్గిరామునకు పూర్తిగాత్రృప్తియైనదట! కూపీలు తీయుటయందు నీకు బ్రజ్ఞయుండవచ్చునని నీముఖమునుబట్టి గ్రహించినాడట! కావున నిన్నికముందు దొంగతనములకు ముందు కూపీలను దీయుట కంపవలయునని యాతడు నిర్దేశించినాడు."

"నాకది సంతోషమే; కాని, ఆతడు నన్నేల అంత తీక్ష్ణముగా తనదృష్టిచే పరిశోధించినాడు ? ఆతనికి నావిషయమై యనుమానమున్నదా ?

"అనుమాన మున్నదనికాదు. పోలీసువారు మనలను బట్టుకొనుటకై చేయు ప్రయత్నములను జూచి యాతడు పోలీసు వాడెవడైన నీవేషమున వచ్చెనేమోయని పరిశీలించెను. అంతమాత్రము జాగ్రతలేని యెడల, మనకీకాలమున నుప్పును గంజియు లభించునా ?"

"నిజమే. అందుకు నేనేమియు ననుకొనుట లేదులెమ్ము. మన మానంత్రిప్రయాణ మెప్పుడు ? ఎంతమంది పోవలయును ?"

"మనమైదుగుర మేగవలయును. రేపు మధ్యాహ్నము బయలు దేరి, సాయంకాలమున కనపర్తి జేరవలయును."

ఇంతలో బలేరాముడు వారున్న తావునకు జేరి, "విన్నన్నా; నాచేతికి తగినపని యీమధ్యదగులలేదు. పంజాపట్టెదవా?" అనెను.

"నాకిదివఱ కలవాటు లేదుకాని; నీకంత యవసరమైన బట్టెదను." అని విశ్వనాథ మాతనితో పంజాపట్టుట నారంభించెను. ఆదిని గొంచెమాతడు బలేరామునకు లొంగునట్లు గనిపించెను కాని, పదినిమిషములైన తర్వాత, నాతడు బలేరాముని ముప్పుత్రిప్పలుపెట్టి యింకెన్నడు పంతముతో పట్టకని యనిపించెను. చుట్టునున్నవారు గొల్లున నవ్విరి దొంగరాము డాతని వీపుపై జఱచి, "వాడికశాస్తి జేసినావు ఇక ముందు మమ్ము బలేరాముడు పంజాబట్టుమనినప్పుడెల్ల నిన్ను జూపింతుము. ఇకనీపేరు వానికి బ్రహ్మాస్త్రమే!" అని మెచ్చుకొనెను

ఇట్లువారు కొంతకాలము వఱకును గాలక్షేపముజేసి, భోజనాద్యవశిష్టములను దీర్చుకొని సుఖనిద్రాపరవశులైరి.

మరునా డుదయము మొదలు మధ్యాహ్నము రెండుగంటల వఱకును, నాగుడిసె నటకరంగస్థలమాయెను. ఆకాలమున నాగుడిసె నుండి, గంటగంట కొక్కడుగా, నొకపంచాంగపు బ్రాహ్మణుడును, నొక కంచుచెంబుల వర్తకుడును, నొకసాతానియు, నిద్దరు రైతులును బయలుదేరి ద్వారపూడిదారి కొకరొకరే అనపర్తి జేర నారంభించిరి వేషముల దాల్చుటయందును, తదనుసరణముగా బ్రవర్తించుట యందును వీరాఱితేఱినవారని యీనాటిచర్యయే బాగుగా చాటగలదు. విశ్వనాథము సాతానివేషము దాల్చెను. దొంగరాముడు పంచాంగపు బ్రాహ్మణుడాయెను. బలేరాముడు కంచుచెంబుల వర్తకుడయ్యెను. మిగిలిన యిద్దరును రైతులవలె బ్రచ్ఛన్నవేషములను దాల్చిరి.

విశ్వనాథము చేతిలోని 'విసిని' కర్రయందు కన్నపుగత్తి యమర్చబడి యుండెను. మిగిలిన నలుగురి చేతులయందలి కర్రలయందును గత్తుల మర్చబడియుండెను. ఇట్లు వీరొకరి వెంబడి నొక్కరు ద్వారపూడి సమీపములనుజేరి సాయంకాలమగునరి కూరియందు బ్రవేశింపవల యును. దొంగరాము డాగ్రహాస్థునింట రాత్రికి భోజనమునకుజేరి, వీధి యరుగుపై సాయంకాలము భోజనమునకు బూర్వము గూర్చుండియుం డును. మిగిలిన నలుగురు సిల్లునానవాలు జూచికొని రాత్రికి వీధియరు గుపై బరుండియుండు దొంగరామునిజేరి యాతని యనుమతి చొప్పున నింటికేచ్చుటనో గన్నము త్రవ్వవలయును తెల్లనారులోపున నందఱను దిరిగి పిడపర్తి జేరవలయును.

ఇట్లు ద్వారపూడినుండి పోవుచుండగా విశ్వనాథము సత్రపున మీపమును జేరిన వెంటనే తనసహజమైన కంఠస్వరముతో భాగవత మునందలి "అల్లవైకుంఠపురంబులో నగరిలో నా మూల సౌధంబు లోపల" అని పాడునప్పటికి వీధియరుగుపై నీ నారాయణదాసా ప్రక్క గదినుండి యరుదెంచెను. అతని జూచి విశ్వనాథము తనమార్గమునుండి మరలక నడచుచునే "మొల్లుటిరాత్రి నీగదియందు ఓటీపడ నేను మును. ఆప్రకారము తత్క్షణమే యేర్పాటులు చేయించవలయునని ముత్యా రావుతో చెప్పు" అని యాతనికి వినిపించునట్లు చెప్పి తనదారినేగి యొక విజనప్రదేశమున గూర్చుండి యొకజాబునువ్రాసి కట్టుకొనినబట్ట లో దాచి యుంచుకొనెను. ఆగి నారాయణదాసుతో మాటాడినచో, నెవ్వరైన గనుగొనినచో, తనప్రయత్నమంతకే కాక ప్రాణమునకు గూడ భంగమువచ్చునని యాతడట్లు నడచుచునే దానుతో మాట్లా డెను.

దొంగరాము డాగ్రహాస్థుని యింటికి సాయంకాల మైదు గంటలకుజేరి రాత్రికి భోజనము బెట్టింపవలయునని వేడికొనెను.

ఆ యజమానియు నొప్పుకొనెను. సాయంకాల మైనతోడనే, యాత డాయజమానితోగూడ వీధి యరుగుపైఁ గూర్చుండెను. ఇంకొక యరగంట కొకరివెంబడి నొక రాఁటిధనిబోయి యూరుబయట మామిడితోపుప్రక్కఁ గూర్చుండి, తమతో దెచ్చికొనియున్న యాహారములను భుజించి యొక మూఁడుగంటలకాలము విశ్రమించిరి. పిదప చాటుమార్గములవెంబడి నెల్లరు నూరు నిశ్శబ్దముగునరి కాతని వీధి యరుగులపైకి బండుకొనుటకు జేరినట్లు కూడికొనిరి; దొంగరాముడతిరహస్యముగా యావద్వృత్తాంతమును మిగిలినవారి కెఱింగించెను. బలేరాముడును మిగిలిన రైతువేషముననున్న యిర్వురును దొడ్డిగోడ దాటి దొంగరాముడు చెప్పినట్లు పడకగదికి మంచముక్రింద గన్నము ద్రవ్వి లోన బ్రవేశించి, గాఢనిద్రయందున్న యజమాని మొలత్రాటినుండి తాళపుజేతుల నూడలాగికొని ప్రక్కగదియందున్న బోషాణమును దెరచిరి. అందుగల నగలపెట్టెను, రొఖము బైకిదీసి యొకరొక్కరే కన్నమునుండి వెలువడిరి. తెల్లవారునరికి పిడపర్తిగ్రామము మంచీలపై నెల్లరును జేరిరి. ఒక్క దొంగరాముడు మాత్ర మచ్చట నాయుదయమువఱకును బరుండి, తెలతెలవారువేళ, దాను కడచినరాత్రి యజమానితో చెప్పినట్లూరిలోని వారెల్లరు దన్ను జూచుచుండగా, బిక్కవోలువైపు బయలుదేరి. యొక యర మైలు బోయి, వెనుకకు మరలి, పొలముగట్లపై ఎనిమిదిగంటలకు పిడపర్తి జేరెను. యజమాని యుదయముననే లేచి, వీధితలుపుదీసి దంతధావనాదుల నొనర్చి బోషాణముదీయుటకు తాళపుచేతులకై మొలదడవుకొనఁగా కానరాక, లోనికిపోయి వెదకి తుదకు బోషాణము జేరి చూడఁగా తాళపుచేతు లాతాళము ననే యుండెను. తెరచి చూడఁగా సగత్రి పిశీదమాయెను. ఇక నాయఁడు చేసినగోలకు మేర లేదు. ఉదయముననే యూరివారి కండ్లయెదుట నొక్క యంగవస్త్రముతో

నేగిన పంచాంగపుబ్రాహ్మణుని యందాతనికి లేశమైన ననుమానమే లేదు; ఈతని పడకగదిలోనుండియును, వంటశాలనుండియును, బోషాణముండిన గదికి మార్గములున్నను, తాళపుచేతుల దీసికొనుటకై యాతని పడకగదికే కన్నముద్రవ్వవలసివచ్చెను. ఆరాత్రి లబ్ధి సుమారు నాలుగువేలు రూప్యము లుండియుండును.

# 9

మరుసటినాడు మధ్యాహ్నమునకు రొఖ్ఖములో గొంతభాగము మాలపల్లెలో నున్నవారికి మామూలుగా పంచిపెట్టబడెను. ఎవ రెవరి కీయదలంచినవి వారివారియింటికి దొంగరాముడే తీసుకొనిపోయి యిచ్చుట యలవాటు. వారివారి యవసరములనుబట్టి అగ్గిరాముని యనుమతిపై దొంగరాముడు సహాయము చేయుచుండును. మాలపల్లెలో వీరిపేరమ్మును దిననివాడును, వీరియెడ విశ్వాసము లేనివాడును లేడు.

పిడపర్తి గుంపులో నున్నవారెల్లరు నానందసముద్రమున నోలలాడుచు నిచ్చవచ్చినట్లు గాలక్షేపము జేయుచుండిరి. అగ్గిరాము డెచ్చటనుండెనోగాని, ఆదినమున నాతడు చిత్రము నొనర్చెదనని వాగ్దానము నిచ్చియుండుటచే పిడపర్తిలోనివా రాచిత్ర మెట్టిదో యని యూహలను జేయుండిరి. కాని ఆచిత్ర మెట్టిదో ఆదినమున మధ్యాహ్నమునకు కలెక్టరుదొరగారికిగాని, అతని యెదుట నేదియో యుత్తరము జదువుచున్న మునిషీకిగాని బోధపడలేదు. దొరగారిమొగము గీచిన కందదుంపవలె నెఱ్ఱనై కోపముచేతను, నాశ్చర్యముచేతను వికృతమై యుండెను. ఆకలెక్టరు చాల సరసుడనియు, ప్రజాహితపాలకుడనియు

ప్రసిద్ధనో [illegible] ఎదుటనున్న మున్షీముఖమున నించుక కొంటె తనము గన్పించుచుండెను. దానికి కారణ మాతఁ డిప్పుడు చదువుచున్న యుత్తరమునందలి యంశములే. ఆసాయంకాలము దొరగారు ద్వారపూడి కాలువలో జమాబందీకై కడియము పోవుచుండె. గావున మునిషీ తీరుబడిగ గూర్చుండి చదువుటకుగాని, దొరగారు కూర్చుండి వినుటకు గాని లేశము నవకాశము లేకుండెను. మనముగూడ నాయుత్తరములోని యంశముల నొకసారి పఠింతము.

"మహారాజరాజశ్రీ గోదావరిజిల్లా కలెక్టరుదొరగారి దివ్య సముఖమునకు, భృత్యుఁడు అగ్గిరాముఁడు సాష్టాంగదండప్రణామము లాచరించి వ్రాసికొను అర్జీ విన్నపములు. దొరగారికి నే నెవ్వరినో, నావృత్తియు గుణగణంబు లెట్టివియో నే నెఱిగింప నవసరములేదని తలంచుచున్నాను. ఏలనన నాపేరీజిల్లారికార్డులలో జరిగిన పది; పదునొకండు వత్సరములనుండియు నగ్రస్థానము నలంకరించియుండు నని నేను చెప్పుకొనుచున్నానని మీరు నాయందు గర్వము నారోపింపవలదు. నేను తమవలెనే ప్రజాహితపాలనమునకై యత్నించుచున్నాను. చేతకానివా రగుటచే పోలీసు నన్ను బట్టుకొనలేక, నాయందు తమకున్న కోపాదులను దీర్చుకొనుటకే నానామమును గలుషపూరితముగా జేయయత్నించుచున్నారు. తమరు రెండేండ్ల క్రిందట నావ్యవహారమున నాపరోక్షమందు విచారించుచు నేను దొంగనయ్యును కరుణయు, మానమును గలవాడనని నిండుసభయం దుచ్చరించితిరని విన్ననాటినుండియు తమ యుదారభావమును గొనియాడుటయే తప్ప, నాకితరోద్యోగ మేమియు లేదు. తమ కసతి కాలములో నాయద్భుత నైపుణ్యము జూపింపవలయునని యానాడే నిశ్చయించుకొని యుంటిని కాని, తొందరపనులవలన, నేటివఱకును తీరిక లేకపోవుటచే యూరకొన వలసివచ్చెను. ఈయాలస్యమునకు మన్నింతురేని, తమకు కొలదిదినము

లోల—నేలఅనగా నేడో రేపో వెల్లుటనో—నాచాతుర్యమును జూపించి మెప్పుబడయగలను.

దేవరవారి దివ్యచిత్తమున కింకొకసంగతి దేవలయునని యిన్ని దినములనుండియు యత్నించుచుంటిని. నేనెంతవాఁడనైనను తమరు సెలవిచ్చినట్లు నాకును మానావమానములున్నవి. దొంగయు మనుష్యుడే. కాని స్త్రీనేను బాటలు గాయుచున్నను బాటసారులను హింసించలేదు. మనుజులసొత్తును హరించుచున్నను వారి మాన ప్రాణముల నెన్నడును స్పృశించి యెఱుగను. విరివిగా దొంగతనము లను జేయుచు, వేలకువేలు ధనము నార్జించుచున్నను, నేను నిత్యభిక్షాధికారినే. భాగ్యవంతులనే దోచి యాధనమును బీదల కొఱ కిచ్చుచున్నాను. అట్టి నన్ను పోలీసు పట్టుకొనలేక, నాయందు ప్రాణహాని, స్త్రీమానహాని, బాలబాలికాహింస, నిర్దయ మొదలగు మహాపాపముల నారోపించుచున్నారు. నేను తమ్ము గోరున దేమన, నాయందు దయయుంచి, నాబారిబడి, నాచే ధనమును బోగొట్టుకొనిన వారిని విమర్శించి, నాయం దిట్టిగుణము లున్నవేమో కనుగొని, పోలీసువారికి బుద్ధిజెప్పవలయుననియే! నాచేత నిరాయుధుడై, నిద్రా వస్థయందున్న నాపరమవిరోధి జిక్కినను నేను వాని ప్రాణమున కేవిధ మైనహానియు నొనర్పననియు, రక్తము గంట జూడననియు నాబిరుద ములు. తమకే నిదర్శనము తెలియగలదు. నేడు జమాబందీపై బయలుదేరుచున్నారు కాబోలును. తిరిగి వచ్చువరి కగ్గిరామునిగురించి, మీకున్న సదభిప్రాయము బలపడునుగాత — ఇట్లు విన్నవించువిధే యుడు — అగ్గిరాముడు."

దొరగారు ప్రయాణపు హడావిడియం దీయుత్తరములోని యంశములకు కోపము నాశ్చర్యమునొంది, వినుగుదలచే, మునిషీ నోళ రెండుతిట్టి, ప్రయాణ మాలస్య మగుచున్నదని, ఇద్దఱు ముగ్గురు

బంట్రోతులపై నురిమి, సాయంకాల మూరుగంటలకు పడవనెక్కి, పడవటాపుపై జాగరూకతతో మేల్కొని యుండవలయుననియు, అగ్గిరాముడు వచ్చిన గలియబడి పట్టుకొనవలయుననియు, నాజ్ఞలనొసంగి పడవలో తలుపులు దీసికొని, తన చందువాపెట్టెను కాళ్ళక్రింద నుంచుకొని గాఢనిద్రాపరవశు డాయెను బంట్రోతులు రాత్రి 12 గంటలు దాటినదాక, మెలకువతో మాట్లాడుకొనుచు నగ్గిరాముని గురించి కథలను జెప్పుకొనుచు గాలక్షేపము జేసిరి. అంత నించుక నిద్రరా వారు జోగుచు, మధ్యమధ్య "అదుగో వచ్చినాడు! ఇదుగో వచ్చినాడు!" అని పలవరించుచు టాపుపై నటునటు సంచరించి తిరుగ నిద్రాపరవశులైరి. రాత్రి 3 గంటలకు పడవ యొకచో రెండులాకులగుండ బోవలసి వచ్చెను. అంతయు నిశ్శబ్దముగ నుండెను. మొదటిలాకును దాటునరి కగ్గిరాముడు లాకు తలుపులో డాగియున్నవాడు గావున, "టాపు" పై వారి కగుపడకుండ పడవ హాలులో ప్రవేశించెను. తిరిగి పడవ రెండవలాకును దాటువేళ కాతడు దొరగారి చందువాపెట్టెలో తలుపులోనికెక్కి డాగెను. దొరగారి పాదములక్రింద ఆయన దుస్తులను మూటగాపెట్టి, అగ్గిరాముడా పెట్టెను కదలిక లేకుండ లాగివైచెను. పడవ లాకును దాటిన తర్వాత నగ్గిరాము డాపెట్టెతో తనదారి బోయెను.

ఉదయముననే లేచి దొరగారు పెట్టెలేదని బంట్రోతులపై నొందినకోప మింతింతయని చెప్పనేరము. ఒకరిద్దఱకు పాదరక్షాప్రహారములు కూడ సిద్ధించెననియు నొకనిని పనిలోనుండి తప్పించివైచెననియు తరువాత తేలినది. ఆపెట్టెలో జమాబందీకాగితములు కొన్నియు, సర్కారురహస్యములుగల కాగితములు గొన్నియు సుమారొక వేయి రూపాయల కాగితములు గలవట! డబ్బుపోయిన నాతడువిచారింపడు. కాని సర్కారుకాగితములు పోయెనని చాల ఖిన్నుడై తనయొద్దనున్న

గుమస్తాలను, బంట్రోతులను నాలుగువైపుల కాతడు పరుగెత్తించి విహ్వాల మనస్కుడయి యాతడా కాలువగట్టున కొంతదూర మేగెను.

ఉదయ మెనిమిదిన్నర గంటలాయెను. ఒక అత్తరులమ్మునా హేబు నాలుగుదిక్కులను గలియజూచి తలపాగ తిన్నగా నమర్చుకొని గుడ్డలో కట్టబడి తన భుజముపై నుండి వ్రేలాడుచున్న పెట్టెతో దొర గారి యెదుటనిలిచి సలాముచేసి పెట్టెను గుడ్డలోనుండి తీసి యాతని యెదుట బెట్టెను దొరగారాశ్చర్య నిమగ్నులై తక్షణమే తనజేబు లోనున్న తాళపుజేతులను దీసి పెట్టెమూత దెరచి లోనిసామానం నంతయు వివరము గా జూచెను. ఈకాలమంతయు నాయత్తరు సాహే బు నాల్గుదిక్కుల జాగరూకతతో బరీక్షించుచుండెను. తుదకు దొర గారు లేచి నిలువబడి " ఎవడవు నీవు " అని ప్రశ్నించెను.

తమకు నిన్న యుత్తరము వ్రాసియుండలేదా ? అందులో చూపెదనన్న చిత్రమే యిది. శలవునిచ్చిన నాదారి నేగెదను. అని వచ్చిన యగ్గిరాము డనెను.

చాల సంతోషము. ఈడబ్బు తీసుకపొమ్ము. అని దొరగారా పెట్టెలోనున్న సుమారు వేయిరూప్యములు విలువగల కాగితములను దీసి యాతనిని దీసికొమ్మని సంజ్ఞచేసెను.

తమ యనుగ్రహమున్న చాలును. ఈడబ్బు నాకనవసరము. ఇట్లు నిరాకరించితినని కోపమువలదు. దీనినేదైన ధర్మమునకు విని యోగించుడు. దయయుంచుడు. శలవు అని తృటిలో నగ్గిరాము డదృశ్యమాయెను. తిరిగి మకాము జేరిన తర్వాత సాధనమును బీద విద్యార్థులకొఱకు దొరగారు ఖర్చుపెట్టిరని వాడుక.

# 10

అగ్గిరాముడు కలెక్టరుగారి పడవయందీచిత్రమును జేయు రాత్రి ప్రారంభించునప్పటికి పిడపర్తిలోని గుడిసెలో నెక్కడజూచినను నవ్వులే. దొంగరాముడు తనయొక్కయు, నగ్గిరామునియొక్కయు, బలేరామునియొక్కయు విచిత్రచర్యలను కథలుగా చెప్పుచుండెను. మనమచ్చట కొంతసేపు విశ్రమించినచో రామత్రయముయొక్క చరిత్ర మించుక తెలియగలదు.

" నేను సుమారెనిమిదేండ్ల క్రిందట నొకసర్కారుద్యోగమున నుండెడివాడను. నాకు నెల కిరువదిరూప్యము లిచ్చుచుండెడివారు. ఇట్లుండగా నొకగ్రామస్థుడు నాయధికారితో పనియుండి మేము మకాముచేసిన గ్రామమునకు దెంచెను. ఆతెడు చాల భాగ్యవంతు డగుటచే యధికారికి బహుమానముగా నెన్నియో వస్తువులను దెచ్చెను. కార కాంతరములచే యాతెడు తిన్నగా యధికారియొద్దకు బోక నాయొద్ద కరుదెంచి యధికారితో తనకార్యమును నివేదింపవలయు నని నన్ను బాధింపసాగెను. నేనదివరకెన్నడు నధికారితో నెవ్వరికొరకును గలుగజేసికొనలేదు కావున నేనట్లు జేయనని నిరాకరించితిని. అత డెన్నియో విధముల బ్రయత్నించెను. కాని నేనందుల కొప్పుకొనక పోవుటచేత నాతెడు నాయందు కోపముగలవాడై బంట్రోతులద్వారా యధికారితో తనపని చెప్పికొని యాతని దర్శించి లంచమునిని యిన్ని దినములవఱకును తనకార్యముదీర్పలేదనియు యిప్పుడాతెనికై తెచ్చిన బహుమానము కావలెనని పట్టుపట్టెననియు నాపై లేనిపోని కొన్నికల్లలను గల్పించి పితూరీ చేసెను. దానిపై నధికారి మండిపడి దర్యాప్తు మీరాయకనే నన్ను పనినుండి తొలగించితినని యుత్తరమంపెను. నేనూరిలోనికి బోయి యెచ్చటనో భోజనముచేసి సాయంకాలమైన

తర్వాత నధికారిని తిరిగి దర్శింపవలెనని యాతని మఠామునకు బోయితిని. కాని యాతడించుక సురాపానముచేసి యుండుటచే మత్తెక్కి నన్నుజూచి దొంగదొంగి యని చేతికర్రను విసిరి, బంట్రోతులను కేకవైచెను. నేను విధిలేక తిరిగి పోయితిని. అతి దాయూరియందొక మూడురోజు లుండెను. నన్నీదుస్థితికి తీసికొనివచ్చిన యధికారికి నా విషయమును దిరిగి నివేదింపదలచుకొని యుంటిని కాని యీవార్త సమీపమున నున్న మాగ్రామమున దెలిసి నాకీలోకమున సర్వమునై యున్న వృద్ధమగు నాతల్లి గుండెపగిలి చనిపోయెనని యామూడవ నాటిరాత్రి నాకు దెలిసినది. దానికి గనువిచారించి నాయధికారిని, నాకీయవస్థ దెచ్చిపెట్టిన గ్రామస్థుని దండించి నాకసి దీర్చికొనవలయు నని నిశ్చయించుకొని యారాత్రి నేను స్వగ్రామమునకు జేరుటకు ముందే నేనందుల కారంభించితిని. రాత్రి యధికారిగృహముం బ్రవేశించి యాతని చందుమామపెట్టెనుహరించి యూరివెలుపలనున్న కాలువలో నూరద్రొక్కి నాయూరునకేగి నాతల్లి కంత్యసంస్కారముల నన్నియు దీర్చితిని. నేను పరువుగల కుటుంబములోనివాడను. ఇకముందే వృత్తిని యవలంబించి యిట్టి నీచులకు గర్వప్రాయశ్చిత్తము జేయవలయునని గట్టిగా జొగబడితిని. ఈచందుమామపెట్టెయందు గాఫీను కాగితము లెన్నియో యున్నవనియు ఇటీవల నాయధికారికి జీతము చాల తగ్గించిరనియు వినియుంటిని. ఇల్లు శ్రాద్ధములైన తర్వాత నాకున్న యాస్తినంతయు పత్రమునకై యిచ్చివైచి యాయూరు విడిచి నాపై బితూరీచేసిన గృహస్థుని పీడింపవలయునని యాతని గ్రామమునుజేరితిని. ఆతడు మంచిస్థితిపరుడు. అతనియింట సుమారిరువది ముప్పదివేల రొఖ ముండెనని వినియుంటిని. అదియంతయు నింట భోషాణమునందుంచి యాతడందుపై పక్కవైచికొని పరుండునని వినియుంటిని. ఆతనియింట బ్రవేశించుట కొకనాలుగైదుదినములు తాచికొనియుంటిని. ఇట్లుండ

నొకనాఁ డాతఁడు తన పెద్దకుమారు నింటనుండి పొరుగూరేగెను. ఆరాత్రి నేనిటిపై పెంకులను దీసి చావడిగోసి యింట ప్రవేశించునప్పటికి నాకు గల్గిన యాశ్చర్య మేమనిచెప్పుదును! నాకెదురుగా నొకమూల పండ్లికి లించుచు నిజబలేరాముఁడు ప్రత్యక్షమాయెను. ఒకరిసంగతి నొకరు గ్రహించి సంజ్ఞలచే నావృత్తాంతమును విశదపఱచుకొని యా భోషాణముపై బరుండినవానిని దింప క్రిందపరుపుతోనిడి భోషాణపు తాళమును మారుచెవులచే దెఱచి. చెరియొక యైదుసంచులను దీసి కొని యాతని మరల నాపరుపుతో భోషాణపుపెట్టెపై పరుండబెట్టి బలేరాముఁడు ప్రవేశించిన కన్నముగుండ వెల్వడితిమి. వెన్నెలలో మేము తెచ్చిన సంచులను దెఱచి చూడగా నందు సుమారుగా నిరువదియైదువేలరూప్యములు కిమ్మతుగల నాణెములును, కాగితములును గలవు. వానికి దగినశాస్తి జేసితిమని సంతసించికొని యిర్వురమును గలిసి బయలుదేఱితిమి. నాకెచ్చటనుండుట కునికిలేకపోవుటచే నీరెండవవానితో గలిసియుండుట కవకాశముండునేమో యని యాతని వంశాదులను బృచ్ఛచేసితిని. అప్పు డాతఁడు తన పేరు బలేరాముఁడనియు, 'నా' యనువారెవ్వరును దనకు లేరనియు సుమారైదేండ్లనుండి యీ వృత్తిలో నుండియుంటి ననియు, నన్నుగూడ తనతో నుంచుకొనుట కభ్యంతరము లేదనియు జెప్పెను. నాఁడుమొదలు మేమిర్వురమును దొంగతనములను జేయుచు తెచ్చిన ధనమును బీదలకొఱకు వెచ్చించుచుంటిమి. ఆబలేరాముఁడే యీబలేరాముఁడు. ఈతఁడు చిన్నతనమున బడిలో ప్రారంభించిన పెన్సిల్పుల్లలదొంగతనమే ప్రస్తుత మీతని యుత్కృష్టతకు సాధనమని యతఁడే చెప్పెను. తోడిబాలుర పుస్తకములను దొంగిలించినవాఁ డెప్పుడును దానే యైనను చదువుకొనిన యెనిమిదేండ్లలో నొక్కనాఁడును పట్టుబడలేదట. పైగా నాదొంగతనము లితరులమీద నారోపింపబడుచుండెనట. ఇట్లు మేమిర్వురమునుగూడ క్రమముగా

కొంతకాలమున కొక పదిమందిని జేరదీసి యిండ్లలో బ్రవేశించుటతో పాటుగా బాటలను గాయనారంభించితిమి. ప్రచ్ఛన్న వేషములతో పగ లూరూరు సంచరించుచు నుండి రాత్రులందు దొంగతనములను జేయు చుంటిమి. ఇట్లుండ నప్పుడు దూరములోని యగ్గిరామునిసంగతి నెవ్వరో చెప్పుకొనుచుండగా వినుచుంటిమి. కాని నాటివఱకును మేమాతని నెన్నడును జూచియుండలేదు. ఇట్లుండగా నొకనాటిరాత్రి గాఢాంధ కారములో మేము గ్వారపూడినుండి రామచంద్రపురము పోవురోడ్డున గాచియుంటిమి నేనును బసేరాముడును మఱియొక్కడును నుంటిమి. రాత్రి 12 గంటలు దాటినతర్వాత నొంటియెద్దుబండి నెక్కి యెవ్వరో వచ్చుచున్నట్లు గ్రహించి జాగరూకులమైయుంటిమి. బండి మే మున్న తావును జేరెను. వెంటనే మేము ముగ్గురము నాబండిపయి బడి బండినాపినాము లోపలనుండి యెవ్వరో "బండియాపిన ముగ్గు రిలో నిద్దరు బండిలో కూర్చుండవచ్చును. మూడవవాడు బండి వానితోబాటు బండితోలవచ్చును. అగ్గిరామునకు బండితోలిన పరువు తక్కువకాదు" అని గంభీరముగా పలికెను. మాకు గుండెలు ఝల్లు మనెను వెనుకకు వచ్చి బండిలోనివానిని జూచి నిర్ఘాంత పడితిమి. అగ్గిరాముని పేరెక్కడ, యీబండిలోని సామాన్య దేహదార్ఢ్యముగల వీడెక్కడ నని యాశ్చర్యమునంది యట్టె నిలిచితిమి అంత నాతడు బండిదిగి "ఈబండిమీద వచ్చుచున్న మనుజుని కట్టి యొక పొలమున నుంచి యీబండిమీదనే నేను వచ్చుచున్నాను. సుమారు పదివేల రూప్యములను దీసికొని కొన్నపొలమునకు జెల్లించుట కాతడు రామ చంద్రపురము వెళ్లునని నాకు నిన్ననే వార్త తెలియుటచే పెద్దా పురమునుండి యింతదూరము వచ్చితిని. నాతో డీకొనవలయునని మీకున్న యెడల రండు" అనెను. మేము వెలవెలబోయి యాతనిచంక నున్న దుడ్డును, చేతనున్న పిస్తోలును, మొలనున్న కత్తినిజూచి "నీవు

నిజముగా నగ్గిరాముడవైన యెడల మేము నీకు భృత్యులమే !" అని యాతనివైపు చూడగా నాతడు నవ్వి "మీరింకను దొంగతనమున నారితేరవలయును. నాతోరండు" అనెను. మే మనుమానించుచుండగా నాతడు నన్నును బలేరాముని జూచి "మీరిద్దఱును నాతోరండు. ఈకుర్రవాని నింటికిబోయి రేపీవేళ కిచ్చట కింకెవ్వరైననున్న వారితో రమ్మనుడు" అనెను. ఆతనియెదుట మేము చేయునదిలేక మాతోనున్న వాని నితరులతో మరుగైనస్థలమున నుండవలయునని చెప్పి మేమాతనితో బోయితిమి. అత డాబండిని రామచంద్రపురము వఱకును దీసికొనిపోయి వానికొక పాతికరూప్యముల నిచ్చి పెద్దకాలువయొద్ద విప్పి యందున్న పయికము దీసికొని మాతోకూడ తన మకాముకు బయలుదేరెను. దారిలో దాతనియాజ్ఞ చొప్పున మారువేషములను దాల్చి బండిచేయించుకొని యాతని వాసస్థానము జేరితిమి. అప్పటి కంతయు విశదమాయెను. ఆరాత్రి మాగుంపులోనివారి నందఱను దీసికొనిరావలయునని నేనును నాతడును బయలుదేరితిమి. నాడు మొదలు నేటివరకును నెల్లరమును గలసియే యుంటిమి, ఇక ముందు భగవదేచ్ఛ యెట్లుండునో, క్రమముగా నందఱితోపాటాతడును నిద్రాదేవిముద్రలను నేత్రముల కద్దుకొని యాలోకమును మఱచెను.

## 11

తూర్పు తెల్లవారినతోడనే యెల్లరును నిద్రనుండి మేల్కొని, విధ్యుక్త కృత్యములను దీర్చికొని రాత్రి జరుపబోవు చర్యను గుఱించి చర్చింప నారంభించిరి. ఎల్లరును తత్పూర్వపు రాత్రియందు వినిన యంశములను గుఱించి నవ్వుకొనుచు, జరుపబోవు నాటకమునకు నాందీ ప్రస్తావనల విరచింప దొడగిరి.

ఈనాటికి తనపై ననుమానము సంపూర్ణముగ నంతరించినదని విశ్వనాథుఁడు ధృవపఱచుకొనెను. అగ్గిరాముడు వెనుక దొంగరామునితో చెప్పిన మాటలవలన గుంపులోనివారెల్లరును, వానితోగూడి మంతనము లొనర్చుచు, వానిసలహా నపేక్షించుచు, వానితో స్వేచ్ఛగా ప్రవర్తింప నారంభించిరి విశ్వనాథ మనిన దొంగరామునకును, బలేరామునకును నపరిమితముగు విశ్వాసమును, స్నేహమును గుదిరెను. కావుననే నాటిరాత్రి యాచరింపవలసిన కార్యమును గుఱించి, వారిద్దరును విశ్వనాథుఁడు చెప్పినచొప్పున నడచుకొనదలచి, యాతని చెంతజేరి మంతన మారంభించిరి. "అగ్గిరాముడు లేనప్పుడు మనకు విస్సన్నగారే పెద్ద; అతని యనుమతి లేనిదే గుంపులోని వారెవ్వరును నేకార్యమును జేయరాదు." అని దొంగరాము డావెనుకటి రాత్రియే గుంపులోని వారికెల్లరకు నెఱింగించెను. అందుచే, మిగిలినవారికి విస్సన్నయందు దించుక గౌరవమును భయమును గూడ జనించెను.

విస్సన్నా! అగ్గిరాముడు వచ్చునో రాడో నిశ్చయముగా తెలియదు. కావున కార్యభారమంతయు మనపై బడినది. మాలోనీవే యెక్కువ యనుభవశాలివి కాన నేడు సంపూర్ణాధిపత్యముతో నాయకత్వమును నేనొసగుచున్నాను. కావున నేటిరాత్రివిషయమై నీయభిప్రాయమేమియో మాకెఱింగించినచో నీయాజ్ఞలను మేమెల్లరమును నెరవేర్ప సంసిద్ధులమై యుందుము" అని తానిదివఱ కనుభవించుచున్న నాయకత్వమును లేశమైన నసూయ జెందకుండ దొంగరాముడు విశ్వనాథునకు ధారవోసెను.

"అసలు సంగతులేమియో నేనెఱుంగను. అగ్గిరాముడు నీకు తప్ప మాకెవ్వరకు నెఱింగింపలేదు. కావున నాకు యావద్వృత్తాంతము నెఱింగించినగాని, నేనేమియు జెప్పలేను అంతియేకాదు? నీనాయ

కర్తవ్యమును నీవేల విడువవలెను. నేనును నీమందలోని వాడనే యని తలంచుము. ”

అప్పుడు దొంగరాము డారాత్రి జరుగనున్న విషయమును గుఱించి, యిట్లు చెప్పదొడగెను. గుంపులోనివారెల్లరు సావధాన చిత్తులై వినుచుండిరి

“ ఈరాత్రి పదిగంటలకు జరుగవలసిన యీవిషయమునుగూర్చి చూచాయగా మీ యగ్గిరాము డిదివఱకే తెలిపియున్నాడు. ద్వారపూడికి నాలుగైదుమైళ్ళ దూరములోనున్న యొక పల్లెటూరినుండి, రామచంద్రపురములో, రేపుదయమున జరుగబోవు పెండ్లికై పెండ్లివారు బయలు దేరుదురట. వారు రాత్రి 10 గంటలకుద్వారపూడివంతెనసమీపములకు జేరుదురట. మనమచ్చటనే కాచియుండి మనపని నిర్వర్తించుకొనవలసిన దని మన యగ్గిరాము డిదివరకే తెలిపియున్నాడు. కాని వచ్చెడి మనుజు లెందఱో యాతడు చెప్పలేదు. ఆతని కెరుక లేదని చెప్పియున్నాడు. బహుశః యావద్వృత్తాంతమును తిరిగి తెలుపుటకై మధ్యాహ్నము లోపున తిరిగి యగ్గిరాముడువచ్చిన రావచ్చును. కాని నమ్మకములేదు. ఆతడు రానియెడల, మనలో నెవ్వడైనను ముందుగా నాగ్రామమునకేగి యచ్చట మనకు గావలసినయంశముల నెఱింగి వంతెనయొద్ద జేరియున్న యితరుల కెఱింగింపవలయును. వచ్చెడువారి సంఖ్య రూఢిగా మనకు తెలియదు కనుక మనదండంతయు నాప్రాంతములనే వేచియుండవల యును. లేనిపోని కొంటెపనులను జేయవలదని యగ్గిరాముడు గట్టిగా చెప్పినాడు ” ఈమాటలను విని బలేరాము డించుక యికిలించెను. “ ఇకిలించుటకాదు. ఈసారి యెవరైన నసలు పనిమాని కొంటెతనము నకు దిగినచో, కార్యము ధ్వంసమగుటయేకాక, తాను తగినట్లు బుద్ధి జెప్పెదనని యగ్గిరాముడు తీవ్రముగా జెప్పినాడు కావున పిఠాపురము

రోడ్డున జేసినట్లు చేయవలసినది శాసించితినని చెప్పినాడు. ఆపైన మీ యిష్టము. అగ్గిరాముని వ్యవహారమంత మాత్రము మఱచిపోవలదు "—

"పిఠాపురము రోడ్డున నెవరేమి చేసినారు? కొంచెము నాకు గూడ నెఱింగింపరాదా?" అని విశ్వనాథము దొంగ రాముని గోరెను.

"అయికిలింపుల ఈరన్న నే యడిగిన చెప్పును చేసినవాడు చూచినవానికన్న సరిగా చెప్పగలుగును కదా?" బలేరాము డీమాటలనువిని నవ్వునాపుకొనలేక వీధిలోనికి బోయెను అప్పుడు దొంగరాము డిట్లు చెప్పెను

"మేమైదుగురము బయలుదేరి పిఠాపురపు రోడ్డున నొకబండి నాపి లోపలి సామానును మోసికొనిరావలయునని నాలుగుమానముల క్రిందట నొక రాత్రి కాచియుంటిమి. సాయంకాల మగునప్పటి కందఱము సర్పవరపురోడ్డున కొక మైలుదూరమున గాచియుంటిమి ఆరోజున నగ్గిరాముడు మాతోలేడు. కోరంగిలో నొకవర్తకుని యింట గన్నమువైచుటకై యాతడు పోయినాడు. ఆనాడు పిఠాపురము రోడ్డున మాకు దొరకెడు సొవ్వు లాభముకన్న నెక్కుడుగా లభించు నితరోద్యోగములున్నను, తానుకూడా మాతో లేనికారణమున సులువుగా తేలునని మమ్మాతడీ రోడ్డున నియమించెను ఇద్దఱు మనుష్యులు నుమారు నాలుగైదువేల రూప్యముల కిమ్మతుగల నగలను చిత్రాడదీసికొని పోవుటకై కాకినాడలో రాత్రి 8 గంటలకు బయలుదేరునని మాకు రూఢిగా దెలిసినది. బండికి గట్టినయెద్దు మాత్రము చాలచురుకైన దనియు వడిగా నడుచుననియు మాకు వర్తమానము దెలిసెను. మేమందఱమునుగూడి రోడ్డుప్రక్క పొలములో త్రాటిమొక్కలచాటున, నిసుకపై బరుండగా, బలేరాముడు నన్ను జేరి కొంతసేపేదియో లోకాభిరామాయణమును మాటలాడి తుదకు తానొక చిత్రము నాచరింప

వలయునని యుద్దేశమున్నదని చాలకాలము నుండి తన యభీష్టము నెరవేరలేదనియు, తానట్లుచేయుటకై యనుజ్ఞనీయవలయుననియు, నెంతయో కాలము బ్రతిమాలగా, ఏమోయనుకొని నేను సరేయని యొప్పుకొంటిని. మీకార్యము సులభముగా నెరవేరుననియు, నాభారమంతయు దనదనియు నచ్చజెప్పి, బలేరాముడు, మాయొద్దనున్న యగ్గిపెట్టెను బుచ్చుకొని, బయలుదేరి పోయెను. మేమెల్లరమచ్చటనే యుంటిమి. ఒక యరగంటలో నాతడు తిరిగివచ్చి, సర్వము సిద్ధముచేసితిననియు, ఆగిపోయిన బండిలోని వస్తువులను సులభముగా తీసికొనవలసినదనియు నాతడు మాతో చెప్పి, తిరిగి తనదారిని బోయెను. ఇంతలో రాత్రి 10 గంటలాయెను. మేమందరమును లేచి, రోడ్డుప్రక్క నీడచాటున నిలిచి బండికై యెదురుచూచుచుంటిమి. కొలదికాలములో బండి మాకు చూపుమేర మాకగుపడెను. బండి వడివడిగా వచ్చుచుండెను. ఇంతలో నయ్యది మేముండిన స్థలమున కొకనూరు గజముల దూరమునకు వచ్చునప్పటికి బండిపై నెచ్చటినుండియో యొకనిప్పులతో నిండినముంత విసరబడెను. అగ్నికణములు బండికప్పుపై చెదరి, యెద్దుపై గొన్ని పడెను. ఆపడినచప్పుడుచేనేమి, మీదబడిన నిప్పులబాధచేనేమి, ఆ యెద్దు దారితెన్నుగానక యొక్కబిగి నుడాయించి బండివానికైన నాపుటకు శక్యముకానిరీతిని పరుగెత్త నారంభించెను. ఆబండినాపుట కడ్డగిలితిమా, మాకు మృత్యువు స్థిరమేయని యూహించి, మేమున్న స్థలమునుండి కదల కూరకొంటిమి. బండి అదేవిధముగ పరుగెత్తుకొని పోయెను. ఈనిప్పు లెచ్చటివని మేమాలోచించుచుండగనే యికిలించుచు బలేరాముడు మమ్ము వెదకికొనుచు మాస్థానము చేరెను. ఆనిప్పులను విసరినదివీడే, ఆనిప్పులు పడినంతనే నయ్యమని భయపడ, బండిలోని వారెల్లరు పారిపోవుదురనియు, నెట్టియాయాసము లేకుండ, బండిలోని వస్తువులు లభించుననియు; నాతని యభిప్రాయమట! ఆరాత్రి మేము

మ్మాకా విషయము తెలిసిన వెంటనే కోటిఫలినుండి బయలుదేరితిమి. ఆతడు మావెంటబడెను. ఆతని కొకటి రెండు దినములూరూర ద్రిప్పితిమి. చివరికి పిడప రిజేరుసటి కాతడు పసిగి తనదారి బట్టెను. ఇచ్చట యదృచ్ఛగా నీకొంప లభించినది నేను వీరి కాతనిచర్య జెప్పకుంటినేని, ఈపాటి కెల్లరము చక్రవర్తి యాతిథ్యమనుభవించుచునే యుండి యుందుము" అని యాతడు స్వప్రాగల్భత ప్రకటించెను. కొంతకాలమునకెల్లరును వంటప్రయత్నముల నారంభించిరి

## 12

సూర్యుడు గగనోపరిభాగము నలంకరించెను. కాని శీతకాలమగుటచే నాతని తీక్ష్ణత నెవ్వరు భరింపజాలకుండుటలేదు గుంపులోని వారెల్లరును భోజనములనుజేసి యగ్గిరాము డరుదెంచునేమో యని నిరీక్షించుచుండిరి. వేళదప్పని యగ్గిరాము డాదినమున వచ్చెదనన్న వేళకు రాకుండుటచే నిక రాడని వారెల్లరు నిశ్చయించుకొనిరి.

"పిన్నన్నా ! ఊరికే కాలక్షేపము చేయుచుండుటకు ? ఇక నాతడుదినమునకు రాడని నిశ్చయించుకొనవలసినదే నీవు త్వరిగా బయలుదేరి నీపనిపై బోవలయును" అని దొంగరాము డాతని లేవదీసి దూరముగా దీసికొనపోయి సుమారొక పదిహేను నిమిషముల వరకును గుసగుసలాడి యాతని బంపివైచెను. విశ్వనాథుడు తనకు గావలసిన సాధనసామగ్రినంతయు దీసికొని బయలుదేరి తనదారి నేగుచు నట్లు దలపోయ నారంభించెను.

"నేటికి నెల్లరంటను నాకొక నమ్మకము తెరినదని నేను సంతోషించుచుంటినే గాని విరియాప్తుగడ యెట్టిదియో నేనెఱుగ లేకున్నాను. వారు నాకు సకల స్వాతంత్ర్యముల నిచ్చివేయుటజూచి యింకను నాచరిత్ర నెఱుగక నట్టునాయుసని వారియుద్దేశమునట్లనుమానముది

యించుచున్నది కావున జాగరూకతనై యుండుటయే మేలు. ఈ జట్టులో నగ్గిరాముడవినను నాకు భయములేదు. కాని దొంగరాముని చర్యలనుజూచిన నాతని నొకకంట జూచుచునేయుండినగాని మోసము గలుగగలదని నాకు స్ఫురించుచున్నది. ఈనాడీతడు నన్నీకార్యమున నియోగించినాడని నాయిష్టమువచ్చినట్లు జేయుటకు వీలులేదు. మూడు వంతులు దొంగరాముడు నావెనుక నాజాడదీయుచు రాగలడని తో చుచున్నది. ఏదెట్లయిన నీరాత్రిజరుగబోవు దొంగతనము నాపివేయ వలయును. తగిన యుపాయమేదైన యాలోచించి దానిన కెతీగింప వలయును. అగ్గిరాముడు వీరితో తిరుగుచు వేరుగా నివసించుచుండు టకు కారణముకానరాదు. ఆతని నివాసస్థల మెచ్చటనో ముందెఱిఁగిన గాని నేను వీరితో జేరియుండిన కార్యములేదు. వీరల నెచ్చటనైనను సులభముగా బంధింపవచ్చును కాని, యగ్గిరాముడు దొరకకపోయిన యెడల వాడు తిరిగి గుంపును జేరదీసి మునుపటికన్న నిచ్చలనిడిగా సంచరింపగలడు. 'రామో, రామేతి, రామేతి, అని దశావతార పురుషునితో సమమైన నామమును దాల్చినవీరు నిజముగా చోరచక్రవర్తి యవతారములే. వీరి లోకానుభవము, భాషారచనయు సాధారణ సంసారుల కుండజాలవు, అందులో దొంగరాము డొకజిల్లా కధికారము నొంది పాలింపదగిన శక్తిసామర్థ్యాదులు గలవాడు వానితో మాట్లాడుటయే జ్ఞానోదయమునకు సాధనమని వేరుగా వచింపనక్కఱలేదు. అక్కటా! లంచగొండి యగునధికారి నిరాదరణముచేతను, మూర్ఖతచేతనుగదా యాతడు దొంగయయ్యెను. లేనిచో నీత డెట్టిదశలో నుండెడివాడో ఎవ్వరు చెప్పగలరు? ఇదివఱకు నేను శోధించిన వ్యవహారము లన్నిటిలో నిది కడుచిత్రముగా నున్నది. నాకండ్లయెదుట వీరొనర్చిన దొంగతనములలో నెచ్చటను దౌర్జన్యమును వీరొనర్ప యత్నించలేదు, వారియుద్దేశములుగూడ నట్టివి కావని స్పష్టపడు

చున్నది. మనదేశమునందిటువంటి కెచ్చటను నేనిట్టియుదారహృదయు లగుచోరులను గనియెరుంగను—ఈ రాత్రి జరుగబోవు దొంగతనము నెట్లయిన నాపివేయవలయును ఒకవేళ నావెంట నెవ్వరైన నంటివచ్చి నను నేను దానుతో నెట్లయిన మాటలాడితీరవలయును.

విశ్వనాథ మనేకమార్గోపాయములచే నెవ్వరైన తనవెంట వచ్చుచున్నారేమో యని కనుగొన యత్నించెను. కాని, యాతనికట్టి యనుమానమే లేకపోయెను. ఆతనివేషము నించుక వర్ణింపవలయును. అతడు తలతకపంచె నొకదానిని ధరించి నల్లనినారలుగల ఎర్రనిపర్తును దొడిగికొనియుండెను. ముఖమున సాతానులవలె నామముండెను. తలపై నొకపెద్ద యంగవస్త్రము తలపాగవలె చుట్టబడియుండెను. పాదములకు క్రిర్రుచెప్పులజోడు దొడిగికొనియుండెను. ఆతడొక 40 లేక 50 పుస్తకములు (పాటలువగైరాలు) గలపుస్తకములకట్టగట్టి తన కుడిచేత బట్టుకొని యెడమచేతియందొకకర్రను (లోపల కత్తి యమర్పబడినదాని) పట్టుకొనెను. మెడలో నాతనిపిస్తోలుండెను. పాటలపుస్తకములమ్మునొకసాతానివలె నాతడుండెను. ఆడుచు బాడుచు నతడు మూడు గంటలకు ద్వారపూడిపత్రముజేరి యించుకసేపరుగుపై విశ్రమించెను. ఆప్రక్కగదిలో దాసేదియో యొకగ్రంథమును బిగ్గరగా చదువుచుండెను. విశ్వనాథము చిరునగవుతో వినుచుండెను.

" కపినాథుండవు నీవు, రాఘవుడనంగా దాపనుండాసురా
ధిపు మువ్వేటియగొన్న రాతుసకులాధీశుండనే, నిన్ను ని
క్కపు దోబుట్టువుగా మదిందలతు, వక్ష్యంబైన నాతోనపాం
డుపడున్ గావున, యేగుమీవెడగు మర్త్యంబాసికిష్కింధకున్ "

వీధియరుగుపై నుండి విశ్వనాథము, ' గావణాబ్రహ్మా! తలుపు దీయుము " అనెను

ఉత్తరక్షణమున దాసు గదితలుపు దీసెను. విశ్వనాథము నలు దిక్కుల జాగ్రతగా పరిశీలించి; తన బట్ట చెంగున జాగ్రతగా కట్టుకొని యున్న యుత్తరమును విప్పి, యాతనికిచ్చి, "ఇంకొక యరగంటలో నీదారినేరమ్ము నీకై కనిపెట్టుకొని యుందును. మాటలాడవలసిన యవసరమున్నది" అనిలేచి యించుక మంచితీర్థము నడిగిపుచ్చుకొని త్రాగి తనదారి నేగెను.

దాసింటిలోని కేగి యాయుత్తరము నొకసారి చదువుకొని, జాగ్రతగా పొందుపఱచి, తనచేతి కఱ్ఱను గైకొని, విశ్వనాథమేగిన దారి నేగవలయునని, తలుపునకు బీగమువైచి, బయలుదేరెను. నాలుగు గంటల కిద్దరు నొక నిజప్రదేశమున గలిసికొనిరి. వారికి క్రింది సంభాషణము జరిగెను.

"నేను నీతో విశేషకాలము మాటలాడుట కవకాశములేదు. నీవుదయముననే బయలుదేరి, కాకినాడకు బోయి, సుబ్బారావుగారితో నాయుత్తరములో నేను వ్రాసిన రీతినంతయు సిద్ధముజేసికొని, నేనేర్పఱచినచోట నుండవలయుననియు, నేను త్తరములో వ్రాసినరీతినే మెలగవలయుననియు గట్టిగా చెప్పి నీవుకూడ వానితో వచ్చుటకు రావలయును నీవేమాత్ర మాలస్య మొనర్చినను కార్యమంతయు జెడిపోవగలదు. నీవీరాత్రి యొక విచిత్రము నాచరింపవలసియున్నది నీదిపిరికి గుండెయా? లేక నిర్దిష్టకృత్యము నాచరింప సమర్థుడవా?"

"నాసంగతి సుమారు పదిసంవత్సరములనుండి నీవెఱుంగుదువు కదా? నేను పిరికి వాడనో కానో నీవెఱుంగవా? చేయవలసినదేదియో చెప్పుము నాశక్తికొలది నాచరింప బ్రయత్నించెదను. అనుమానింపకుము."

"అట్లయిన నీకీపనినే చేయవలయును." అని విశ్వనాథమాతనితో నేడెనిమిది నిమిషములవఱకు నూకు వినబడనట్లు రహస్యముగ మాటలాడెను. దాసు తృప్తి జెందెను.

"అట్లయిన నేనిక నాలస్యముచేసిన ప్రయోజనము లేదు. నీపెట్టెలోనున్న ధనము దీసికొని నాకవసరమైనంత వెచ్చించెదను" అని దాసు లేచెను.

"పొరబాటు వచ్చిన కొంపలంటికొనును. జాగ్రత. నేను బోయెదను" అని విశ్వనాథము బయలుదేరి తానేగదలచిన పల్లెటూరు సాయంకాలము కాకుండగనే జేరెను అతఁడాయూర చీకటి పడువరకును సంచరించి సాధ్యమగు వర్తమానము నంతయు సేకరించి తిరిగి రాత్రి 8½ లేక 9 గంటలగుసరికి ద్వారపూడి కేతెంచి సత్రమును దాటుచు, "తస్మాత్ జాగ్రత జాగ్రత" అని దాసునకు బరాబు జెప్పి సంకేత స్థానమును చేరెను. ఇంకొక పదినిముషములకు దొంగరాముడు గుంపులోని మిగిలినవారునేతెంచిరి. వీరెల్లరును సంతెనడిగిన నూరు గజములలోనున్న పిల్లకాలువగట్టున విశ్రమించిరి విశ్వనాథము తాను గ్రహించిన యంశములను గుంపులోని వారికెరింగింపజొచ్చెను. పురుషులారుగురు మాత్రమేయున్నారనియు, మొత్తమైదుబండ్లు బయలుదేరుచున్నవనియు, ముప్న పురుషులంత బలాఢ్యులవలె నగుపడలేదనియు నింకొక యరగంటలో బండ్లురాగలవనియు, వార్తలాతని వలన నెరింగిన తర్వాత వారి యుత్సాహమునకు మేరలేను. అగ్గిరాముడు సమయమునకు రాకూడదాయని వారు తలంచుచుండవచ్చును రాత్రి పదిగంటలాయెను. బండ్లిక వచ్చువేళ యైనదని ఎల్లరును వేచి జాగరూకులై రోడ్డుప్రక్క చెల్లమురుగున నిల్చియుండిరి. దొంగరాముడు ఛాయవలె నొకరిని విడిచి యొకరిని జేరుచు, నించుక కాలమేదియో ప్రసంగించి పోవుచుండెను. అవసరమైన యెడల కత్తులను దీసికొని వారలను బెదరింప వలయునని కూడ గుంపు వారలకారాత్రి యాజ్ఞయొసగబడెను. వారిలో నెవ్వడును చొక్కాలను గాని మోకాలుదిగిన దుస్తునుగాని ధరించి యుండలేదు అందరును వైష్ణవసూచకమగు నామములను

ధరించియుండిరి. చేతులందు కత్తులమర్చబడిన కర్రలు మాత్రముండెను బండ్లు సంకేతస్థలమును జేరెను

గుంపంతయు నొకపెట్టున బండ్లపైబడి బండ్లవాండ్ర నీవలకు లాగివయిచిరి. వారొనర్చినగోలచే, బండ్లలోని వాండ్రందరు నొక్కపెట్టున "దొంగలు! దొంగలు!" అని కేకలువైచిరి. "గొంతుకలు నొక్కవలయునా, నోరుమూసికొని యూరకుందురా?" అని విశ్వనాధ మొకసారి గర్జించెను. ఆకత్తులను జూచి బండ్లలోని పెండ్లివారికి దేహములు కంపింపసాగెను. ఒకరొక్కరే, బండ్లలోనుండి దిగి, క్రింద నిలువబడ నారంభించిరి. అప్పుడొక యద్భుతము జరిగెను. కాలువలో నుండి పుట్టినరీతి నదివఱకు వంతెనక్రింద దాగియున్న కొందఱు మనుష్యులొకకాగడాను వెలిగించుకొని, రోడ్డునెక్కుచు, "పట్టుకొనుడు, పట్టుకొనుడు వచ్చుచున్నాము! వచ్చుచున్నాము!" అనికేకలు పెట్టుచు నాల్వైపు డప్పులు వాయించుకొనుచు పరుగెత్తిరి. ఈ విచిత్రమును జూచి, దొంగలొకటిరెండు తెప్పపాటులకాల మట్లేనిలిచి యొకరిమొగము నొకరుజూచికొని, యొక్కపెట్టున పొలములలోబడి పారిపోజొచ్చిరి. ఈవచ్చినవారు నారాయణదాసును, ఆతిడారాత్రికిజీతమిచ్చి చేరదీసిన, చాకళ్ళును, మాదిగలే! వారాబండ్లనుజేరి, రాత్రికి వెనుకకు మరలి ద్వారపూడి సత్రమున, ముకాముజేసి, తెల్లవారు ఝామునసే బయలుదేరవచ్చునని నచ్చజెప్పి, వారలను సత్రము వఱకును దీసికొని వచ్చి, ఎవరి దారిని వారేగిరి, దాసు సత్రమున తనగది బ్రవేశించెను.

## 13

ఆరాత్రి యగ్గిరాము గుంపులో గలియకుండుట కొకహేతు వుండెను. ఆతడాయుదయమున కలెక్టరును దర్శించి, మారువేషమున రైలుపై కాకినాడకేగి యచటనొక విచిత్రమగు వ్యవహారమును పరి

శోధించుచుండెను. ఆతడా రాత్రి యీగుంపులో నుండియున్న యెడల, గుంపులోనివారల్లు హడావిడిగా పరుగెత్తికొనిపోవుట కవకాశముండి యుండునా ? బండ్లలోనివా రదిచటకే భయగ్రస్తులై యుండిరి కాన యాతడుముందుగా నావచ్చినవారిపై నురికి వారిని పారద్రోలి యనంత రము తనకార్యమును నెరవేర్చికొని యుండును. ఆమాటనే గుంపులోని వారలకు సర్వభయముగా విశ్వనాధముపదేశించుచుండెను. ఆమరునాడు దయమున వెలవెలబారిన మోములతో నెల్లరును నిద్రమేల్కాంచి రాత్రి జరిగినవిషయమును గురించి చర్చించునప్పుడు, బలేరాముడు, కలలోకూడ మనప్పు హఠాత్తుగా నెందరో మనుష్యులు దండెత్తుదురని మనమనుకొననియప్పుడు వారిదర్శనమైన వెంటనే మనమనుకొన్న మీద యుండుటయు, వెంటనే మనదారిని మనముపోవుటయు సహజమేకద ?" అని వచించుటగాని, విశ్వనాధ నాంటాభ్యాసమునకు నాగు పునెదుట నుపదేశించుట కవకాశము కలిగెను.

"మనము కండ్లుతెరువని పసిపాపలకన్న హీనముగా ప్రవర్తించి తిమి, అగ్గిరాముడే మనలోనున్నచో దొంగల, మనము నెట్లు తొందరపడ వలసిన యవసరముండెడిది కాదు, వెనుకటి దుల నాలోచింపక, మన ము రాబోవులాభమును మఱచి, నాడు బలేరాముడుచేసిన చిత్రమున కిద్దరముపరుగెత్తుకొనిపోయినచో అట్టి పొలములలో జొరబడితిమి ఆ వచ్చినవారు బహుశః బండ్లలోనివారి బలముగలే మయుండవచ్చును. వారు బస్తీకించుక దూరమైన నాపన్నాగావంకనోడను తోడుగా వచ్చుచుండిరేమో ? దారిలో దొంగభయము మెండైన గలిగిన యెడల, నాదొంగలను భయకంపితులను జేయుట కీపన్నుగడ బన్ని యుందురు. అది మనము కానలేక వారలవలలో చిక్కితిమి ఇంతమాత్రపు పనిలో దించజాలని మనమేరీతి నీవృత్తియందు గడితేరగలమో నేనెఱుంగ జాలకున్నాను. నేనిట్లంటినని మీకునాపై కోపము కలుగునేమో ?

నేను యథార్థముగా నాహృదయమున దోచినమాటలఁ జెప్పుచుంటిని. నీ యభిప్రాయమేమి ?" అని యాతఁడు దొంగరాముని బ్రశ్నించెను.

"విన్నన్నా! నీవుచెప్పినదంతయు నిజమే! నిష్కారణముగ మోసము నొందితిమి. ఇకమీఁద నిదియొక యనుభవముగా జూచుకొనవలయును. ఇన్నిదినములనుండియు, దొంగతనమున మనమార్జించిన కీర్తియు, ననుభవమును నిన్నరాత్రి ద్వారపపూడి కాలువలో గలిపితిమి" అని యాతఁడు విషాదహృదయుఁడై పలికెను.

"ఇంతమాత్రమున కేల విచారింపవలయును? పెండ్లివలువుట కై యుంచిన ముహూర్త బలిమిచే పెండ్లికారిక పుణ్యము రాలేదని యనుకొందము. ఇది మనకొక మంచియనుభవముగా నుండఁగలదు" అని విశ్వనాథము ధైర్యము చెప్పెను.

ఇంతలో నాపేటలోని మాలలు కొందరు దొంగరామునితో పనియుండి వచ్చుటచే నీప్రసంగమాగిపోయెను. దొంగరాము డావలకేగి, వారితో కొంతవఱకేమేమియో ప్రసంగించి తిరిగి యింటిలోని కరుదెంచి కొంతధనమును దీసికొనిపోయి వాండ్రకు బంచిపెట్టెను. వాండ్రును తమదారినేగిరి. గుంపులోని వారెల్లరును వంటప్రయత్నములు చేయనారంభించిరి.

ఆమధ్యాహ్న మగ్గిరాముడు మారువేషమున రైలుపై కాకినాడ కేగెనని చెప్పియుంటిమి. ఆతఁడాయూర నొక యద్భుతమగు పరిశోధన జేయుటకై యేగియుండెను. ఆయూర నొకభాగ్యవంతుడగు తెలగకులస్థుఁ డొకఁడుండెను. ఆతఁడు వ్యాపారమున నుమారునాలుగై దు లక్షలరూప్యముల విలువగల యాస్తినార్జించెను. ఆయూరనే వ్యాపారము విరివిగా జేయుచుండుటచే నాలకచ్చేరి నొక దివ్యమైన భవనమును నిర్మించుకొని యందు తనభార్యతో వసించుచుండెను. ఇట్లుండఁగా

నాత డగ్గిరాముడాయూరుజేరిన రెండురోజులకు బూర్వ ముదయముననే పోలీసువారికొక కింటెకథను దెలిపెను. తనకులస్థుడైన యొకొకడు తన భార్యను లేవదీసికొని వెనుకటిరాత్రి చెన్నపట్టణమువైపు లేచిపోయె ననియు, తన భార్య సుమారిరువదివేలరూప్యములుగల నగలతోడను కొంత రొఖముతోడను పోయెననియు నాత[illegible]చి, వారిని బంధిం చుటకై చెన్నపట్నము టెలిగ్రాము నిప్పించెను. ఆసాయంకాలమాతని భార్య బంధుగులయింట పెండ్లిజూచుట కేగుదునని మిషపై నిల్లువెడలె ననియు, రాత్రి ప్రొద్దుపోయిన తర్వాత నామె తిరిగివచ్చునేమోయని, యాతడూహించి నిద్రించెననియు నుదయముననే చామర్లకోటకేగిన తనబంట్రోతురుదెంచి, తానామె నింకొకనితో నారాత్రి 11 గంటలకు చామర్లకోటలో రైలులో చూచితిననియు నిదివఱకెట్టి యుద్దేశమున్న దని తాననుమానించుచున్న పురుషుడారాత్రి చెన్నపట్నము వైపేగ ననియు నాతనికథ. ఆపురుషుడొంటరిగా నెల్లూరుస్టేషనున దిగెనని పరిమానము తెలిసినదేకాని [illegible]జాడకాని [illegible]మెజాడకాని పోలీసు వారు కనిపెట్టలేకపోయిరి. [illegible] అగ్గిరాముడ[illegible] కేగెను.

ఇదివఱకు కొలది దినములక్రిందట నొకరాత్రి యగ్గిరాముడాగృహమున బ్రవేశించి, దొంగతనము జేయదలంచియుండగా, నారాత్రి భార్యాభర్తలకు జరిగిన వివాదమంతవఱకు జరిగెనో యాతడెఱుంగును ఇకనారాత్రి తనపనినెరవేర లేదని నిరాశజెంది యాతడా గృహమును విడిచిపెట్టెను. [illegible] ప్రసంగమువలన నేడయో యను మానము కలుగ నాతడాయింట దిరిగి ప్రవేశింపదలచెను. రాత్రి పది గంటలు [illegible] బజారుచేయుచు, [illegible] రాత్రి [illegible] దొంగతనములో [illegible] నంనట నిరీక్షించుకొని, సిధితలుపు

దగ్గరగా పెట్టి, ఆపత్సమయములో కానిచ్చికొనిపోయెను.'' మాటాడ యత్నించితివేని నీప్రాణములపై యాశ విసర్జించుకొనవచ్చును.'' అని ఆతడాబల్లెముతోను కెలికించియుండుటచే నాతడు నులుకుబలుకు లేక పిల్లి వలె నూరకుండెను. నాతని నొక నిర్జనప్రదేశము కీడ్చికొనిపోయి, యగ్గిరాముడీరీతిగా ప్రశ్నించెను.

“నేనెవ్వడనో నీ వెరుగుదువా? నన్నిదివఱకెన్నడును జూచి యుండకపోయినను నాపేరయిన వినియుందువు. నా పేరు అగ్గిరాము డందురు. నేనడిగిన ప్రశ్నలకు సరియగు సమాధాన మిచ్చెదవేని, నీకు బహుమాన మిచ్చెదను. అబద్ధములాడు నుత్తరము లిచ్చెదవేని తత్క్షణమే నిన్నాకనబడుచున్న యుప్పుటేటియందు దూరద్రొక్కెదను. నీ చావు బ్రతుకులు నాచేతి యందున్నవి. కావున నీయభిప్రాయమును వెంటనే చెప్పవలయును. ఆలస్యమయినచో నేనుద్దేశించిన కార్యము చెడిపోవును. నీమర్యాదయును నీకు దక్కదు. ఏమందువు? “అడుగుడు నిజమే చెప్పెదను” అని దీనముగా నాబంట్రోతు వేడికొనెను.

“అడ్డదిడ్డమగు సమాధానము లిచ్చినను ఏవిధమయిన పెంకె తనము జేసినను నీ మానప్రాణములు [illegible]గావు. నీవు నిజముగా నీ యజమానురాలిని చామర్లకోటలో రైలులో చూచితివా లేక నీయజ మానునివలన లంచము దిని; యాతడాడుమనిన మాటనే యాడు చుంటివా? నాకీ వ్యవహారమున యథార్థము నెఱుగుట కవకాశమున్న దని యెఱిగి జవాబునిమ్ము.”

“నేను నాపనిమీద చామర్లకోట కేగినమాట వాస్తవమే. నేను రైలుకై వచ్చినప్పు డచ్చట నిలిచియున్న యింకొక రైలులో నామెను చూచినమాటయు వాస్తవమే.”

అగ్గిరాముడందులకు సమాధానముగా తన చంకయందున్న దుడ్డును జూపించుచు "నీదేహమునయందున్న ఎముకలన్నియు పొడిచేయ వలయును కాబోలు! నీముఖమునుజూచిన నీచెప్పినమాట లన్నియు నబద్ధములని వేరుగా వచింపనవసరములేదు" అని తని చేతిముడుకు లపై తన దుడ్డుతో నొకటిరెండు దెబ్బలుకొట్టెను ఆతడరచుటకయి యత్నింప, "కేకలు పెట్టినచో పీకనులిమి యుప్పుటేరున నూగద్రొక్కె దను. జాగ్రత" అని బెదరించెను. ఇక తప్పుకొనుటకు మార్గములేక బంట్రోతు దీనస్వరముతో నిట్లు చెప్పనారంభించెను. "నే నాదినమున చామర్లకోట నాయజమాని పంపగా నేగితిని. నాయజమానురాలు రయిలులో నాకెందును నగుపడలేదు. యజమాని నన్నట్లు సాక్ష్య మిమ్మని నిర్బంధించుటచే నేనట్లు చెప్పవలసి వచ్చెను. నేనేపాపకర్మ మెరుగను."

"నీయజమానురాలేమయినదని నీయుద్దేశ్యము" అని అగ్గిరాము డిరువదిరూప్యముల వానిచేతనుంచెను. దానికాతడు సంతుష్టుడయి అయ్యా! నాకావిషయమేమియును తెలియదు. నాకనుమాన మేమి యును లేదు" అని పల్కెను.

"నీవింట బంట్రోతుగా నుంటివికదా? భార్యాభర్తలకు సంబంధ మెట్లుండెడిది?"

"దినదినము నిరువురును నేదియో యొకవిషయమై తగవులాడు చునే యుండుట స్వభావము."

"మీాయజమాను డిప్పుడెట్టిస్థితిలో నున్నవాడో సరిగా చెప్పిన నింకొక పదిరూప్యము లిచ్చెదను. నాతో సనత్యము చెప్పకుంటివేని నీకింకను లాభము రాగలదు."

"పగలాతం డీవలకరుదెంచుటలేదు. ఇంటియందే కాలుకాలిన పిల్లివలె నిటునటు నూరక తిరుగుచుండును. ఇనుపపెట్టెయున్న గది మాత్ర మెప్పుడును, విడిచి యుండుటలేదు. తన్నెవరయిన జూడ నరుదెంచినను దర్శనమిచ్చుటలేదు."

"నేను తిరిగి నీకొఱకరుదెంచి, నీకట్లను విప్పువఱకును నీవిచ్చటనే యుండుము" అని అగ్గిరాముడాతని త్రాళ్ళతో గట్టిగా బంధించి నోట గుడ్డలుక్రుక్కి, సందులో నొకమూరుమూల జాగ్రతగా వెదకినను కనబడనిరీతిని బడవైచి తానేగెను.

ఇంకొక రెండు నిముషములలో నాతిడాగృహమును బ్రవేశించి, ద్వారము బంధించి, బంట్రోతుకై మేడపైనుండి అదేపనిగా పిలుచుచున్న యజమానిగదిలో బ్రవేశించెను.

ఈవిగ్రహమును జూచి యజమాని నిశ్చేష్టితుడై యాతనిదెన వెఱ్ఱివానివలె జూడజొచ్చెను. అగ్గిరాముడు గడపపైనుండి, కదలకట్లే నిల్చియుండెను. కొంతకాలమునకు యజమాని ధైర్యము దెచ్చికొని, కించిద్గద్గదస్వరముతో "ఎవరునీవు? ఎందులకై వచ్చితివి" అని ప్రశ్నించెను. అగ్గిరాముడు నవ్వుచు గడవదాటి లోనికేగి, వెనుదిరుగకయే ద్వారమును బంధించి, చంకనున్న దుడ్డును చేతబట్టుకొని, యజమానిపై వుజూచెను. యజమాని దేహమంతయు గంపించుచుండెను. నోటిమాటరాక తుదకాతడు గట్టిగా వెఱ్ఱివానివలె, "పీరిగా పీరిగా!" అని బంట్రోతును కేకవైచెను. అగ్గిరాముడు దుడ్డునెత్తి మరల నారీతిని కేకలు పెట్టితివేని, పీరిగాడున్న చోటును నీకీదుడ్డు చూపించగలదు. అనెను,

ఆగృహాధిపతి యవస్థవర్ణింపనేరితరము? అర్ధరాత్రివేళ నవ్యవస్థగల చిత్తముతో బాధపడుచున్న నాతనిమెదుట నకస్మాత్తుగా వృథ

గాత్రుడగు నొకపరియచయములేని పురుషుడుజేతికి నరియగు దుద్దుతో ప్రత్యక్షమైనప్పుడితర సాహాయ్యమేమియు లభించుట కవకాశములేని యాతనిమరవస్థ యెంతని వ్రాయగలము. ఆతని పంచప్రాణములను నొక్కచోట్టి యాతని నేత్రద్వారముగుండ బయల్వెడల యత్నించునోయ నునట్లాతడు తదేకదృష్టితో సాక్షాత్కరించి చోరచక్రవర్తిని జూచు చుండెను ఇట్లయిదు నిమిషములైన తర్వాత నగ్గిరాముడాతనిగూర్చుం డనియుమించెను యజమానియు మారుమాటాడక చెంతనున్న ఆసన మునందు గూలబడెను. అగ్గిరాముడు సంపూర్ణవిజయము గాంచెనను టకు సందియములేదు ఆత డధికారముతో ప్రసంగింప నారంభించెను.

"పోలీసువారి కన్నులను గప్పినను నాకన్నులు గప్పలేవు. నేను సర్వాంతర్యామిని నాపే రగ్గిరాముడందురు ఇది నీయింటికి నా రెండవరాక. మొదటిపర్యాయ మరుదెంచినప్పుడు నీభార్యను భయ పెట్టుచుంటివి. నే నరుదెంచినపని నెరవేరినదికాదు. నేను తిరిగి దర్శన మిచ్చితిని. నీభార్య నేమిచేసితివి ? యదార్థ మెఱిగింపుము. కాల యాపనజేసిన కాదు నీకు రెండునిమిషముల గడువు నిచ్చుచున్నాను."

అని యగ్గిరాము డాతనివైపు తీక్షణదృష్టులను బరపుచు తలుపునకు జేరగిలబడి నిల్చియుండెను.

యజమానిమొగమున నెత్తురు, మచ్చునకైన గనబడుటలేదు. ఆత డధోవదనుడై దీర్ఘచింతాసముద్రమున మునిగియుండెను. అగ్గిరాము డిచ్చిన రెండునిమిషములు గడువు దాటిపోయెను. అగ్గిరాము డాతనిని సమీపించి భుజముపై జేయివైచి లేవదీసెను. "సమాధాన మీయవా ? నీయిచ్చవచ్చినట్లు—ఇంతలో నాయజమాని యక స్మాత్తుగా నగ్గిరామునిపై బడి యాతని చేతిలోని దుద్దును లాగికొన యత్నించెను. ఆతని లోంగదీసి నేలపై బడవైచి తనయొద్దనున్న త్రాళ్ళతో నాతని కాలుసేతుల బంధించి నోటగుడ్డలుక్రుక్కి మొలలోని

తాళపుజేతుల నూడదీసికొనుట కొకనిమిషమైనను బట్టలేదు. తోడనే యాతడినుపపెట్టెను జేరి కడప్రయానమున నెట్టకేలకు సరియగు తాళముజేతుల నేరుకొని దానిని తెఱచెను. ఆత డాపెట్టెను తెఱచుట యేమి ఛీ ఛీ అనుచు వెనుకకు నాలుగడుగులు వైచుట యేమి, యొక్కక్షణముననే జరిగెను. ఆయినుపపెట్టెయం దాయజమానుని భార్య శరీరము కాలుసేతులు నరుకబడి యుంచబడెను. ఆమె శిరస్సు కూడ నరకబడియుండెను అగ్గిరామునకు మితిలేని అసహ్యము జనించెను వెంటనే క్రిందపడియున్న యజమానుని తనకాలితో నాలుగు తన్నులు తన్ని చండాలుడా ఛదియా! "నీకుట్ట! అని మొగముపై నుమిసి ఆపాపిష్ఠిసొమ్ముకై యూసింపక యాతని వ్రాతబల్ల సొరుగులను దీసి అందుగల రొఖ్ఖమునుదీసికొని యొకకాగితముపై పోలీసుఇన్‌స్పెక్టరు కొక లేఖవ్రాసి స్వాయముగా దాసి నాతని కొఱకు నిశ్చయించుకొని యిదివరకు తానెఱింగిన యిల్లగుటచే త్వరలో జేరి తలుపు బిలిచి తలుపుదీయవచ్చిన సుబ్బారావున కాయుత్తరము నిచ్చెను. సుబ్బారావు దానిని దీపపువెలుగున జదువ లోనికేగెను. అం దిట్లు వ్రాయబడి యుండెను.

"తత్‌క్షణము తమరు—యింటికేగిన యెడల నాతని మోనము బయల్పడగలదు. ఆతడే తనభార్యనుచంపి ఆమె శవమును ఇనుపపెట్టెయం దుంచినాడు. ఆలస్యము చేయక వెంటనే బోవలయును. ఇట్లు విధేయుడు అగ్గిరాముడు

సుబ్బారావు తిరిగి వీధిలోనికి వచ్చెను. అగ్గిరాముం డదృశ్యుడాయెను. ఆతడు నాటిపోయెనని దెంచి ఉత్తరములోని యభిప్రాయమును బరిశీలింప నాతడు పోలీసుస్టేషనునుండి కొందరు జనానులు దీసికొని ఆయింటికేగి తెరువబడియుండిన తలుపుదీసికొని యజమానుని కొఱకు

గేకలువెట్టుచు క్రమముగా మేడనెక్కగా యావృత్తాంతము బోధపడెను. ఆయజమాని యసహాయస్థితిని గనిపెట్టి అది అగ్గిరాముని పనియేయై యుండుననీ యాలోచించి యిరుగు పొరుగు వారలకు వర్తమాన మంపి పంచాయతీ శాస్త్రోక్తముగా జరిపి ఆయజమానుని ఖయిదీగా నీడ్చుకొనిపోయెను తెల్లవారినతర్వాత నా ప్రక్కసందులో బంధింప బడి యుంచబడిన బత్రోతునుజూచి యెవ్వరో ఘనాత్ములు వాని బంధనలను విప్పిరి కాని వాని కొంతకాలము తిరుగుచున్న పోలీసు చేతులలో నాతడనాయాసముగా నయాచితముగా చిక్కెను.

# 4

ఉదయము మొదలిడిన్నర గంటలకు నారాయణదాసు శాకీనాడ జేరి సుబ్బారావుగారికొంట కాయన యుంటిముందరుగుపై వేచియుండెను. ఆవెనుకటిరాత్రి చాలవరకు మేల్కొని యుండుటచే సుబ్బారావింకను నిద్రనుండి మేల్కొనలేదు. నిష్కారణముగా నాయుననిద్ర నేల భంగ పఱుపవలయు నని నారాయణదాసరుగుమీాద వేచియుండెను. ఇంకొక యరగంట దాటినతర్వాత సుబ్బారావుగారు లేచి దంతధావనార్థము వీధియరుగుపై కరుదెంచెను. ఆయనయు, దాసును నొకరి నొకరు పలుకరించుకొనిరి. పిదప నారాయణదాసు తన జేబులోనున్న యుత్తరము నొకదానిని దీసి ఆయన కొసంగుచు "ఆయుత్తరము గో వ్రాసిన ట్లన్నియు నేర్పాటులు గావించుకొని మిమ్మిందులో సర్ణయించిన తారీఖున నావేళకు సిద్ధముగా నుండవలయునని చెప్పినాడు" అనెను

సుబ్బారావుగారాయుత్తరమును పాంతము పరించి ఆశ్చర్య మగ్నమానసుడై మరల నొకసారి పఠించి తనివి తీరక తిరుగ నింకొక సారి పఠించెను. మిారిందలి యంశములు నెఱుంగరు కాబోలును!

మీరుకూడ దీనిని పఠింపుడు" అని యాయుత్తరమును దానున కొన గెను. అత డొకసారి దానిని చదివి సుబ్బారావుగారి కోరికపై తిరిగి యిట్లు చదివెను.

మకాము—ద్వారపూడియొద్ద పొలములో
15 డిశంబరు 1900.

మహారాజశ్రీ అర. సుబ్బారావుపంతులుగారికి, విశ్వనాథము వ్రాయునది. నేను భగవదనుగ్రహమువలన నేటివఱకును సురక్షిత ముగానే యున్నాను నేనును వారలలో నొకడనై తిని. వారలలో తిరుగుచు బందిపోటుల కేసుచుట్టివిప్పి. మీకష్టకాల మిక తీరిపోయి నట్లు కనుపించుచున్నది. 18 వ తారీఖున రాత్రిపడి తరువాత నార్య పట్టమున—గారియింట దొంగతనము జరుపుటకు నిశ్చయము గడినది. మీరియుత్తర మందినతత్క్షణమే తిగిన పోలీసువారిని దీసికొని యుంగు మీకుజూపిన ప్లానుప్రకారము వారల నంచవలయును ఈయుత్తర మందిన తత్క్షణమే మీరు స్వయముగా నిచ్చటకేగ ఆయింట యజమానునితో యీవృత్తాంతమును జెప్పి యీయనకు ధైర్యముజెప్పి ఈ రాత్రికే మీరందరును నాయింట ప్రవేశించి యింటలోనివారల నెచ్చ టకైన సమీపగ్రామ మంపవలసినది. దొంగతనము జరుగురోజున మాత్రము మీరెవ్వరును పైకగుపడకుండ నుండవలెను. దొంగలు ప్రవేశించి మార్గము ప్లానులో నున్నది. అతిజాగరూకులై యుండ వలయును. జయము తప్పక సిద్ధింపగలదు. ఇచ్చట ప్లాను వ్రాయబడి యుండదును.

విశ్వనాథము.

ఆదినమున సుబ్బారావుగారికి తీరికయే లేదు రాత్రి చాలవఱ కునిద్రలేకయుండియు పగలంతయు నాతడు కూర్చుండుటకైన నవ కాశము లేనంతశ్రద్ధగా పనిచేయవలసి యుండెను. అగ్గిరాము డిచ్చిన

వర్తమానముపై వెనుకటిరాత్రి ఘాతము పట్టుకొనిన హంతకునిగురించి యింకను చాల పని జేయవలసియున్నది. ఆలస్యమైనచో సాక్ష్యము పూర్తిగా లభింపకుండుట యటుండ నేరస్థుడగు నాయజమాని యపరాధి కాడని స్థిరపడుట కవకాశముగూడ గలుగగలదు. ఈపనికిదో డాత డారాత్రి కార్యపట్టము జేరి యచ్చట విశ్వనాధము వ్రాసిన చొప్పున నేర్పాటులన్నియు గావింపబడవలసి యున్నవి. సాయంకాల మగునప్పటి కాత డెట్టకేలకు నని నిర్ధారించుకొని నలుబదియైదుగురు కనిస్టేబులతో నార్యపట్టము బయలుదేరి విశ్వనాధము వ్రాసినట్లు రాత్రి 12 గంటల కేర్పాటులనెల్ల గావించి బడలికచే పరివారముతో పాటుగా కండ్లు మూసెను.

ఇక పెడపర్తిలో నాదినమున గుంపువారేమి చేయుచుండిరో యించుక గనుగొనెదము. మధ్యాహ్నమున కెల్లరు నించుక విశ్రమించి, భోజనాదులనుజేసి, కొంతవడి కేదియో లోకాభిరామాయణము మాటలాడుకొనిరి. ఆకాలమున విశ్వనాధము పరధ్యానముగ నుండెను. అతడు చిత్తమున నిట్లు తలపోయుచుండెను. నేను పంపిన యుత్తరమును దీసికొని, యీవరికి నారాయణదాసు కాకినాడజేరి, సుబ్బారావుగారికి దానినిచ్చి యేర్పాటులన్నియు గావించియుండెనా ? సుబ్బారావుగారూరనుండియుండునా, లేక గ్రామాంతరము బోయియుండునా ? గ్రామము విడువకుండ, సాధ్యమగునంతవఱ కచ్చటనే యుండవలసినదని వెనుక నేను చెప్పినమాటల నాతడు పాటించి కాకినాడలోనుండినచో, తప్పక యేర్పాటు లన్నియును నీవరికిజేసికొనియే యుండును. ఈసమయమునుదాటినచో తిరిగి వీరు నాబారిబడుట యసంభవమే! నేను కూడ దొంగవలెనే మెలగవలయునుకాని నాసంగతి వీరిలో నెవ్వరికైన దెలిసినచో, పోలీసువారి యెదుటనే నన్నుకడతేర్చెదరు. ఈసారి గుంపువారెల్లరును దప్పక దొరకెదరని నమ్మకమున్నది భగవదేచ్ఛ

యెట్లుండునో తెలియదు. దొంగరాముడు నాయందు నమ్మకముంచి ఆర్యవట్టములో జరుపదలచిన దొంగతనమును గురించి, యావద్వృత్తాంతమును నాకెఱింగించుటచే, ప్లానుగూడ తయారుజేసి ఎచ్చోటిచ్చోట జవానుల నుంచవలయునో కూడ తెలుపగల్గితిని. నేటికి సుమారు వారముదినములనుండి నాకులమును మఱచి నానాజాతులవారితోడను గూడి, సంకరమైతిని. ఇంటికేగినతర్వాత దానేమి ప్రాయశ్చిత్తము చెప్పునోగదా?" అని లోలోపల నానందించుటచే నతని ముఖమున కళవొచ్చెను. లోపలి యానందము వెల్లివిరియగా నాతనిముఖమున చిరునగ వంకురించెను. అతనివైపు రెండు నిమిషములనుండి చూచుచుండిన దొంగరాము డదికనిపెట్టి పెద్దనవ్వునవ్వెను

"విన్నన్నా! విన్నన్నా! ఆకాశమున మందిరములను నిర్మించి నీచాతుర్యమునుజూచి నీవే యానందించు చుంటివాయేమి?" విశ్వనాథ ములికిపడి, పరుండినవాడులేచి కూర్చుండెను.

"లేదోయి! నేను మీగుంపులో జేరుటయు మీరెల్లరును నాయందు దయయుంచి, నన్నాదరించు చుండుటయు, దలచుకొని నాహృదయమున విశ్వాసము జనింప మీసుగుణ పరంపర కచ్చెరువందుచు, నాకు జీవనోపాధి కలిగినందుల కానందించుచుంటి."అని యాతడు సర్దుకొనెను.

ఇట్లే సాయంకాలమువఱకును గాలక్షేపము జేసి యెల్లరును తిరిగి వంటలజేసికొని భుజించి గుడిసెవెలుపల నించుకకాలము విశ్రమించి రాత్రి 9 గంటల కెల్లరును తిరిగి గుడిసెలో దూరిరి. ఇంకొకపావు గంటకు వీధితలుపు నెవ్వరో తట్టిరి. ఆతట్టినయాతడు మిత్రుడే యని తట్టినపద్ధతివలన గ్రహించి దొంగరాముడు పోయి తలుపు తెఱచెను. అగ్గిరాముడాగుడిసెలో ప్రవేశించెను. గుడిసెలో నున్నవా రందఱు నానందపరవశులయి "అగ్గిరాముడికి జయ్" అని కేకవయిచిరి. అగ్గి

రాముడు తన భుజమున నున్న మూటను దొంగరాముని కొసంగి యొకచాపపై నుపవిష్టుడాయెను. కుశలప్రశ్నము లిరువంకల దీరెను. పిదప దొంగరాముడా వెనుకటిరాత్రి తమకు గలిగిన పరిభవమును గురించి విపులముగా నెఱింగించెను. అగ్గిరాము డంతయు విని జరిగిన దానికి విచారింపవలదని హెచ్చరిక నొసంగెను.

పిదప నాతడు జరిపిన రెండువిచిత్రచర్యలను గురించి విపులముగా వారలకెల్ల నెఱింగించెను. అతడు కథలను జెప్పుటలో నద్వితీయుడు. అతడు చెప్పుచుండగా విని మిగిలిన వారెల్లరును కడుపు లుబ్బునట్లు నవ్వనారంభించిరి. చివరకాతడా యింటియజమానుని బంధించి యినుపపెట్టెను దీసి మోసము నెరింగి దొరకిన ధనమును ప్రోగుచేసికొని పోలీసువారి కుత్తరమును వ్రాసి న్యాయముగా నిచ్చు వంశముల నెఱింగించునప్పుడు గుంపులోనివారలకు గలిగిన యానందమే యానందము! విశ్వనాథమునకు గలిగిన యాశ్చర్యమే యాశ్చర్యము! అగ్గిరాముని ధైర్యసాహసములకు తీక్ష్ణబుద్ధికిని, విశ్వనాథమునకు మితి లేని యాశ్చర్యము జనించెను.

"పోలీసుయిన్‌స్పెక్టరు సుబ్బారావుగారు చాల మంచివాడని నే నాయనకీ వర్తమానము నొసగ నిశ్చయించుకొంటిని" అని అగ్గిరాముడు వచించునప్పుడు విశ్వనాథ మీసారి సుబ్బారావుగారితో గలిసికొనునప్పు డగ్గిరాముని విషయమై దయదలచుట యొప్పిదమే యని వాదించి యాతని హృదయమున మరల నిశ్చయించుకొనెను.

అనంతరము దొంగరాము డామరునాడు జరుగవలసిన ప్రయత్నమును గురించి యగ్గిరాముని ప్రశ్నించెను. అగ్గిరాము డుదయమున నచ్చుటి కింకొక యిరువురరుదెంతురనియు, మొత్తముగా గుంపువా రందరును గలసి బయలుదేర వలయుననియు జెప్పెను. దొంగరాముడు తన యొద్దనున్న కాగితముపై నాయింటిప్లానును వ్రాసి అగ్గిరాముని

కొనగెను. అతడు దానిని బుచ్చుకొని యేరీతిగా నాగృహమున బ్రవేశింపవలయునో, యెందరెంద రెచ్చటనుండవలయునో విపులముగా వ్రాసి గుంపువారి కెల్లరకును జూపించెను.

"ఈదొంగతన మైనతర్వాత కొన్నిదినముల వఱకు మనమెల్లర మూరకొని యుండవలయునని నాయభిప్రాయము. ఇదివఱకు చాలదినములనుండి యొకటేరీతిగా పనిచేయుచున్న మనకొక్కింత విశ్రాంతి నడుమనడుమ నుండినగాని ముందు ముందు మనకు చాల భారముగ దోచగలదు. మనమెల్లరమును గూడి దూరదేశమునకుబోయి, అచ్చట కొంతకాలముండి తిరిగి వచ్చెదముగాక! ఈలోపున గోదావరిజిల్లాలోని భాగ్యవంతులు తిరిగి ధనమును సేకరించుకొని మనకై యెదురు జూచుచుందురు. నిర్విఘ్నముగా కొన్నిదినముల వఱకును మనవృత్తి సాగగలదు" అని అగ్గిరాము డుపన్యసించెను. ఆమరునాడు దూర ప్రయాణమును వనిభారము నుండుటచే, క్రమముగా నెల్లరును నిద్రా నక్తులైరి.

# 15

మరునా డుదయముననే మేల్కొని, పెందలకడ నెల్లరును వీడ పత్రి మాలగూడెముననున్న గుడిసెలో వంటలుజేసికొని; భుజించి, కార్యాలోచనా నిమగ్నులై యుత్తమోపాయముల నూహింప మొదలిడిరి, అందఱు నుపవిష్టులైరి. అగ్గిరాము డిట్లు ప్రసంగించెను.

"ఇదియే కొంతకాలము వఱకును మాకడసారి దొంగతన మని యే తలంపవలయునని, నిన్నరాత్రి తెలిపియుంటిమి. ఇకనొక కొంత కాలము వఱకును, మనము విశ్రాంతి ననుభవింపవలయునని నాయుద్దేశము. మీకును విశ్రాంతియనిన నసహ్యముగ గాన్పింపదనియే నా

యభిప్రాయము. కావున నేటిరాత్రి మనయావచ్ఛక్తిని ధారవోయవల యును. మనకీరాత్రియం దేవిధమైన నంతరాయమును రాదనియే నా నమ్మకము. ఏమయినను మనజాగ్రత్తపై మనముండుట యనవసరము. ఏదెట్లయినను, నేనుమాత్రము మీాకొఱకు క్షేమములనే మదియందుంచు కొని, సర్వదా మీాబాగునే కోరుచుండెడివాడనగుటచే, మనమనుభ వించు విశ్రాంతికాలమున నెల్లరము నొకచోటనే యుండుట శ్రేయ స్కరమని, నిన్నరాత్రి దలపోయగా, నాకు స్ఫురించినది. నేనుపుట్టిపెరి గిన యీాజిల్లాయందే సరియగు స్థానము నేర్పఱచుకొన యుండదలంచి తిని. అది మున్ముందు తెలియజేసెదను. ఇక మనము నేటిరాత్రి జరుప వలసినదాని విషయమై యించుక విచారింతము. అర్కవట్టము సామా న్యమైన గ్రామమయినను మనము చేయు దర్శింప నున్నగృహ మూరు నకు నడుమనున్నది. చుట్టును గృహములున్నవి. కాని పశ్చిమ దిక్కున నున్న పెద్దకొంప కారణాంతములచే నిప్పుడు నిర్జరమై యు న్నది. కావున మనము ప్రవేశించుట కాదిక్కే యుత్తమ మని నిర్ణ యించితిని. ఆమార్గమున బ్రవేశించునెడల మనయునికి పైవారికెఱుం గుట కవకాశము లేదు. కాని యొక్కటే చిక్కుగుపడుచున్నది. దొడ్డి గోడ యెత్తుగానుండుటయు, వీధిగుమ్మముతప్ప వేఱొక్కటి లేకుం టయు మనము తప్పించుకొని పారిపోవుట కించుక నడ్డముగా నుండ వచ్చును! మనము ప్రవేశించు ప్రదేశమున కెదురుగానున్న నిర్జనమైన యింటియరుగుపై నొక్కడు పండుకొనవలయును. లోనికిబోవుమార్గ మచ్చట కేగిన తర్వాత మీాకు దెలిపెదను. సాధ్యమగునంత వఱకు బెదరింపులతోడనే యింటిలోనివారల నెల్లర భయపెట్టి మన పని నెఱవేర్చుకొనవలయును. తగినంత యవసర ముండినగాని కఱ్ఱనుగాని, కత్తినిగాని, యుపయోగింపరాదు. ఇంటిలోనివారలను బంధించుటకే ముందుగా ప్రయత్నింపవలయును. సాధ్యమగునంతవఱ కింటిలోనివా

లేవిధమైనగోలను గావింపకుండునట్లు జాగ్రతగా నుండవలయును. వారేవిధమైనగోలను చేసినను మనకు చాల సిబ్బంది కలుగగలదు. ఏలనందురా? గ్రామము చిన్నదైనను గ్రామస్థులయందు చాల నైకమత్యముండుట సహజము. అదిఅట్లుండనీ. ఇంటికి నాలుగుదిక్కులయందును గృహము లున్నవని చెప్పియుంటిమి. ఏమాత్ర మలికిడియైనను. గ్రామము నలుదిక్కులునుండియు జనసమూహ మరుదెంచి యింటి కన్నివైపుల కాచికొని మనము పారిపోవుటకు వీలులేనట్లు చేయుదురు అప్పుడు తప్పక మనగుంపులో కొందఱు దొరుకుట సహజమే. ఇన్ని చిక్కులున్నను లబ్ధి సుమారేబది యరువది రూప్యములరొఖముండుటచే మనమీ ప్రయత్నము జేయవలసియున్నది. ఏదయిన నల్లరియగు నెడల ప్రహరీగోడ మూలలకు జేరి వీలుకొలది త్రాటినిచ్చెనలతో నాలుగుమూలలనుండియు బారిపోవలయును. కావున వేగముగా వాటిని సిద్ధపఱుచుకొనవలయును. అవి సిద్ధమైనవెంటనే యొక్కరొక్కరుగ నెల్లరమును పొలముకాపులవలె వేషములను ధరించి సాయంకాల మగుసరి కార్యవట్టమును జేరి యూరిబైట నున్న చెరువుగట్టుపై దక్షిణపుదిక్కున మకాము జేసి, మనతో దీసికొనిపోయిన యాహారమును భుజించి, యించుక విశ్రమించి, యాపై పని నారంభింపవలయును. చెప్పినయంశములలో ప్రతిదానిని జ్ఞప్తియం దుంచుకొని సాధ్యమగునంత జాగ్రతతో మెలంగవలయును.

పిదప గుంపులోనివారెల్లను నాలుగు త్రాటినిచ్చెనలను సిద్ధమొనరించుటకై పూనుకొని సుమా రరగంటకాలమునకు నార్యవట్టము జేరుటకై కాపువేషముల ధరింప నారంభించిరి ప్రతిదొంగయు కత్తి లోపలమర్చబడిన కఱ్ఱలను చంకయం దిడికొని తలకొక తలపాగ ధరించి, యొక్కరొక్కరే యాగుడిని విడిచి బయలుదేర నారంభించిరి. బయలుదేరిన పదుగురుదొంగలలోను చిన్నన్నయు, దొంగరాముడును,

బలేరాముడును, నగ్గిరాముడును చేరియొక త్రాటినిచ్చినయు బట్టలో మూటగట్టి యొకచేతనామూటను బట్టుకొనిపోయిరి. ప్రతివాదును చిన్న చిన్నకుండలయుం దాహారమునుగూడ దీసికొనిపోయిరి. సాయంకాల మగునప్పటి కెల్లరును చెరువుగట్టుపై భోజనముల నారగించిరి.

దొంగ లిచ్చట భోజనముచేయునప్పటి కప్పుడే కాకినాడనుండి యరుదెంచిన నలుబదియేడుగురును భోజనములను జేసి విశ్వనాథముచే నిర్ణయింపబడిన స్థానములయం దతిజాగరూకులై కూర్చుండియుండిరి. ఎవ్వరును గట్టిగ మాటలాడుకుండుట యటుండ ననలే నోట నేవిధమైన శబ్దమును వెలువడనీయకుండిరి. శ్వాసముకూడ వినబడనియంత నిశ్శబ్ద ముగా నెల్లరును గూర్చుండి సంజ్ఞల చేతనే యొకరిభావముల నొక రాగాఢాంధకారమునగూడి నెటుంగ నుత్సహించుచుండిరి. నిర్జనమని చెప్పబడిన యాయింటియందు సుమారిరువదియెనుగురు కనిస్టేబులును సుబ్బారావుగారితోకూడ నిలువబడి యుండిరి. ఆయింటికి తూర్పు దిక్కున నున్నయింటియందు పంద్రెండుగురు పోలీసుజవానులు డాగిరి. దొంగలు ప్రవేశింపదలచిన యింటియందు బలనశులైన యెనమండు గురును కనిస్టేబు లుండిరి తలనిండ ముసుగు గప్పికొని పైకెగగట్టబడిన కట్టుబట్టతో నాపాదుపడిన కొంపయరుగుపై నారాయణదాసు పండు కొనియుండెను. రాత్రి నిశ్శబ్దముగ నుండెను. దా నతిజాగ్రతతో ప్రతి శబ్దము నాలకించుచు బరుండెను.

పంద్రెండు గంటలాయెను. ఛాయాగ్రహాములవలె నడుగుల చప్పుడైనను వినబడకుండ పదుగురుమనుజు లాపాదుపడిన యింటి ముందు నిలిచిరి. దాను నిశ్శబ్దసమయమున నించుక వినిపించెడు శ్వాసాధారముచే వార లరుదెంచినట్లు గుర్తించి జాగరూకుడై యుండెను. ఆయరుగుపై బరుండినమనుజుని చూచి వారించుక యును మానించిరి రెండునిమిషములకాలము వారలట్లే నిలిచియుండిరి

అంతట నగ్గిరాముడు మెల్లగా నాతడు పరుండిన యరుగుపై నెక్కి-నాలుగైదు నిమిషములవఱకు నాతనిదెన జాగ్రతగా చూచుచునే యుండెను. పిదప నాతడించుక సంతుష్టుడై తిరిగి మిగిలినవారు నిలిచి యున్న తావునుజేరి వారితోనించుకకాల మాలోచించెను. ఎట్టకేలకాతడు దృఢనిశ్చయుడై, తనగుంపులో నొకనినిబిల్చి "నీవేగి, వానిప్రక్కనే పరుండుము. వానికేవిధమైన ననుమానము లేనిరీతి మెలంగవలయును. వాడు మేల్కొని నిన్నెందులకైన లేపినచో, నేదియో ప్రసంగించుచు, నిద్రాసక్తుడవైనట్లు మెలంగుము. జాగ్రత్త" అని యాతడు నియమించి, మిగిలినవారితో గూడ యాయింటి కించుక దూరముగా పోయెను. ఇంకొక యైదు నిమిషములలో నెల్లరును త్రాటినిచ్చెనల సహాయమున నా ప్రహరీ దాటి లోనప్రవేశించిరి. దొంగ లా యింటికి పశ్చిమముగానున్న పడకగదియందు గన్నము త్రవ్వి యచిరకాలములోనే లోపలకుబోయిరి. ఊరంతయు నిశ్శబ్దముగ నుండెను. వారు లోపల బ్రవేశించి క్రమముగా నిల్లంతయు శోధించుచుండిరి. కాని వారికాయింట నెవ్వరున్నట్లు తోచకుండుటచే, ననుమానాస్పదులై, మోసము జరిగినదా యని, యింటిమందువాయందు నిలువబడి చూచుచుండిరి. దొంగలందఱు నత్యాతురులై ఇతికర్తవ్యతామూఢులై యుండిరి.

అప్పుడొక యద్భుతము తటస్థించెను. ఆదొంగలు ప్రవేశించిన యింటి దొడ్డివసారా తలుపు తెరువబడెను. దొంగలు నిశ్చేష్టులై నిలువబడియుండిరి. ఇంకొక యరనిమిషమునకు "దొంగలు! దొంగలు!" అను పెద్దధ్వనియు, దిక్కులు మారుమ్రోగునట్లీలపై నీల వినబడెను. తత్క్షణమే నారాయణదాసు తన చెంతనున్న వానిపైబడి నేలకదిమిపట్టెను. పాడువడిన యింటనుండి, సెలయేటిప్రవాహమువలె కనిస్టేబులు వెలువడి యా యింటి పశ్చిమ, దక్షిణోత్తర దిక్కులకు

పట్టుకొనిరి. ఇంకొకచో దాగియుండిన పండ్రెండుగురు జవానులు తూర్పుదిక్కున కరుదెంచిరి. పెద్దగోల యయ్యెను. ఊరంతయు గగ్గోలయ్యెను. దొంగలు వెలువడి నాలుగుమూలలను త్రాటినిచ్చెనలతో గోడలనుదాట ప్రయత్నించిరి. లోపలనున్న కనిస్టేబుల యొత్తిడిచేనేమి, యీవలకాచియున్న కనిస్టేబుల యొత్తిడిచేనేమి, దొంగలు పోరాడ ప్రయత్నించినను, వారి యాటలు సాగినవికావు. లోపల నిర్వురును బయట నార్గురును దొంగలు పట్టువడిరి. అరుగుపై నారాయణదాసదిమిపట్టు కొసియున్న వానితో తొమ్మండుగురైరి. లోపలనున్న కనిస్టేబులు పట్టుకొనిన దొంగల నీవలకీడ్చుకొని వచ్చిరి. అందఱు కరదండములు దగిలింపబడెను. ఇంక నెవ్వరైన నుండిరేమోయని చుట్టును నాయింటికి కొందరు జవానులు కావలియుండిరి. ఇంతలో సుబ్బారా వచ్చుట కరుదెంచి దొంగల నెల్లరను లెక్క పెట్టెను. ఆతడు తలుపు కన్నమునుండి లెక్క పెట్టిన పదుగురిలో నొక్కడు తగ్గియుండెను. అగ్గిపుల్లను వెలిగించి చూడగా ప్రధాన పురుషుడగు నగ్గిరాముడు పట్టుపడినవారిలో నెందును గానరాలేదు. గ్రామములోని వారెల్లరును గుమిగూడిరి. "అగ్గిరాముడు లేడు ఇల్లంతయు వెదుకుడు కనిస్టేబులేగి సోదా చేయవలయును" అని సుబ్బారావాజ్ఞ నిచ్చెను. కనిస్టేబులింట జొరబడిరి. ఎంతవెదకినను వారికగ్గిరాముడెందును గానబడలేదు. అప్పుడు సబిన్స్పెక్టరు కనిస్టేబుల నందఱను బిలిచెను. లెక్క చూడగా నందొక్కడు తక్కువగ నుండెను. గ్రామస్థులలో నొకడు, "కనిస్టేబొక్కడగ్గిరాము తిరుగుచుండెనని, గొల్లపాలెమువైపు కోడ్డున పరుగెత్తుకొని పోవుచుండె" నని తెలిపెను. లాభములేదనియు, నాతడే తిరిగి వచ్చుననియు, పగటి వఱకు నాయింటిని గాచుకొనియుండుటవసరమనియు, సుబ్బారావు చెప్పుటచే, తెల్లవారువఱకును వారిచ్చటనే కాచుకొనియుండిరి. ఉదయమున వెంటనే తిరిగి వారాయిల్లు

నాలుగుమూలల వెదుకగా, నొక చాపక్రింద, దొడ్డివసారాలో, నోట గ్రుక్క-బడిన గుడ్డలతో త్రాళ్ళచే బంధింపబడిన యవయవములతో, కళ్ళుబట్టతో నొక పోలీసుకనిస్టేబు వారికంట బడెను. జరిగినమోస మప్పుడు వారి కించుకస్ఫురించెను

ఆ జరిగిన మోసమెట్టిది? ఆమోసము సుబ్బారావుదనుకొనిన యంతటితో తీరలేదు. మూల మూల వెదకుచున్న యొకకనిస్టేబుపై నకస్మాత్తుగాపడి, అగ్గిరాము డాతనినోట తన మొలనున్న గుడ్డను గ్రుక్కి, తనయొద్దనున్న త్రాటినిచ్చిన త్రాళ్ళతో నాతని బంధించి, యొకమూల బడవైచి, పై నొకచాపనుగప్పి యాతని దుస్తులను తానే ధరించి; యింటియావరణమునందు దొరకిన ఖైదీలను కనిస్టేబు లావలకు దీసికొనిపోయినవెంటనే, తానుగూడ, తూర్పున గోడదాటి గొల్లపాలెము రోడ్డున పరుగెత్తికొనిపోయెను. గ్రామస్థు డొకడడ్డె యెవరువారని ప్రశ్నింపగా, "నగ్గిరామునికొరకు" అని పరుగుమానకయే ప్రత్యుత్తర మిచ్చెను. సంతుష్టుడై గ్రామస్థుడా వార్త నిచ్చుటకు జెప్పవచ్చెను. రోడ్డుపై బడి పరుగెత్తిన వాడిక తిరిగి లభింపడుగదా యని, సుబ్బారావు మిన్నకుండెను. అట్లాతడు వడివడిగా పరుగెత్తికొని పోవుచుండగా, గొల్లపాలెము దాటి యొకపర్లాంగున కాతని కొకబండి యెదురాయెను. అగ్గిరాముడాగి యించుక యాలోచించెను.

"సుబ్బారావుగారి కించుక నాశక్తి సామర్థ్యములు రుచి జూపింప వలయును. ఇంతకన్న మంచిసమయము తటస్థించునా? అగ్గిరాము డనినపేరు జ్ఞాపకముండవలయును."

ఎదురుగావచ్చుచున్న బండిని రోడ్డుప్రక్కనున్న అగ్గిరాముడు దారికడ్డై యాపెను. బండిలో నిద్దురేయుండిరి. నిద్రపోవుచున్న బండి వాడులేచి గొల్లుమనెను. బండి కెదురుగా నిలిచియున్న అగ్గిరాముడు

తన దుడ్డునుజూపించి "గోలజేసిన దీనితో జావమోదెదను. బండిలోని వారు దిగి రోడ్డుపై నిలువబడవలయును" అనెను. ఆ విగ్రహమును జూచి, బండిలోనివారు రోడ్డుపై నిలిచిరి. బండిలోనున్న పెట్టె నీవలకు లాగి తాళముపరచి లోపలనున్న నాలుగువందలరూప్యముల రొక్కమును దీసికొని పెట్టెమరల బండిలో పెట్టి ఆర్యవట్టములో పోలీసువారున్నారు. వారికీసంగతి తెలియజేయుడు, అని కాకినాడవైపు సాతడేగెను. 'బ్రతికితిమి జీవుడాయనుకొని వారు గొల్లపాలెము నొద్ద తూర్పు తెల్లవారువఱకు నాగి, యుదయమున నే బయలుదేరి ఆర్యవట్టముజేరి, పోలీసువారి కీవార్త దెలిపిరి. సుబ్బారావు మితిలేని యాశ్చర్యమున మునిగిపోయెను.

అగ్గిరాముడు తూర్పు తెల్లవారునగికి కాకినాడ జేరి, తిన్నగా, సుబ్బారావుగారి యింటికేగి, తలుపుదట్టెను. లోపలనుండి తలుపు తీయుచు నెవ్వరో "ఎవరువారు"అని ప్రశ్నించిరి. నేను కనిస్టేబును" అని అతడు సమాధానమిచ్చెను. తలుపు తెరవబడెను. అగ్గిరాముడు లోపలకు ప్రవేశింపకయే ఇట్లడిగెను

"అమ్మా! సుబ్బారావుపంతులుగా రార్యవట్టమునుండి యిప్పుడే స్టేషనునకు వచ్చినారు. ఆయనదుస్తులను దీసికొనిరమ్మని నన్ను బంపినారు వారు తీసికొనివచ్చిన ఖైదీలతో మేజస్ట్రీటుగారి యొద్దకు బోవలయుననియు, నత్యవసరమనియు, నన్ను బంపినారు. త్వరగా నీయవలయును."

సుబ్బారావుగారి భార్యకాబోలును, లోనికేగి, యొకనరాయిని యొకకోటును, ఆయన తలపాగయును, బూడ్సుజోడును దెచ్చి అగ్గిరామునిచేతి కొసగెను." అమ్మా నేనేగెదను." అని యాతడా దుస్తులతో తనదారి నేగెను. ఆ మధ్యాహ్నము సుబ్బారావుగారింటి కరుదెంచునరి కీవర్తమానము భార్యవలనవిని యేమియు దోచనివానివలె కుర్చీలో కూలబడెను.

ఆ మధ్యాహ్నము దొంగలందఱును ఖైదులో నుంపబడిరి. ఒక్కొక్క డొక్కొక గదియం దుంపబడెను ఒక్కొక్కగది కిద్దఱు దొప్పున పహరాజవాను లుండునట్లు సుబ్బారావాజ్ఞ నొసంగెను. విశ్వనాథము దొంగలతోబాటు గదులలో చివరనున్న దానియం దుంచబడెను. అగ్గిరాముడు తన్నట్లుమోసముచేసెనని సుబ్బారావు మొదట విచారించినను నాతని ధైర్యసాహసముల కాతడుమది నానందించుచు మిగిలిన గుంపంతయు నాతనిచేతబడెనని మాత్రము సంతోషించెను. ఆదినమంతయు బడలికదీర్చుకొనుటతో సరిపోయెను.

మరునా డుదయముననే జైలులోనిజనుల కాశ్చర్యజనక మగు నొకవార్త వ్యాపించెను. ఖైదీలలో నొక్కడు రాత్రికిరాత్రి గదిగోడకు కన్నముత్రవ్వి పారిపోయెనని వదంతి కలిగెను. ఆపారిపోయిన వాడావెను కటిదినమున నుంపబడినవారిలో నొకడని తరువాత దెలిసెను. అటు తరువాత వానిపేరు విస్సన్న యని విదితమాయెను. ఈవ్యాపార మంతయు సుబ్బారావుగారే, చేయించిరి దీనివిషయముననే వెనుక విశ్వనాథమును, సుబ్బారావుగారును మాటలాడికొనినపుడు మొదట ననుమానించి యెట్టకేలకు విశ్వనాథమునకు గోపము రాగలదని సుబ్బారావుగారు సమ్మతించిరని వెనుక దెలిపియుంటిమి ఈవార్తను విని సుబ్బారావుగారు జైలున కరుదెంచి ఖైదీలదరిపోవునట్లు గదిని కావలిగాచియున్న కనిష్టేబులపై నురిమి వారలపనినుండి తప్పించి, ఖైదుజేయించెద నని బెదరించి వారియొద్ద సముజాయిషీలను బుచ్చుకొని యింటికేగెను ఆకనిష్టేబులకుకూడ నీరహస్యము విదితమగుటచే వారును మిన్నకుండిరి. ఖైదులోనున్న దొంగరాముడును తక్కినవారు ను విస్సన్న సాహసమునకు మెచ్చుకొన నారంభించిరి. ఈతడు గది

నెట్లు కన్నము త్రవ్వగలిగెనా యని వార లాశ్చర్యమగ్న మానసు లయిరి. కాని వారిగదులను గాచుచున్న కనిష్ఠేబులా పారిపోయిన దొంగ తనగది గాచుచున్న కనిష్ఠేబులపై నేదియో మందు ప్రయో గించియుండు నని చెప్పుటచే వాంచుక తృప్తిగని తమకు గూడ నట్టి మందు నేదయినను ప్రసాదించి ఖైదునుండి తప్పించుకొను నుపాయము జూపుమని వారు భగవంతుని బ్రార్థింపజొచ్చిరి. ఎన్నివిధములజూచిన నాజైలుగోడ లితరోపాయము లేకుండ కేవల భుజబలప్రయోగమున నసాధ్యమే యని వారు స్థిరపఱచుకొని తప్పించుకొనుట కింక వేఱు పాయము లేమియు లేవనియు నేదైన పన్నుగడ బన్ని యగ్గిరాముడె వారల నాచెఱనుండి తప్పింప యత్నించునేమో యనియు నాతనిపై భారమంతయు నుంచి భావిఫలముల కెదురుజూచుచుండిరి.

ఆ వెనుకటిరాత్రి జైలునుండి తప్పించుకొనిపోయిన ఖయిదీ నిర్భయముగా పోలీసునబిన్స్పెక్టరు సుబ్బారావుగారి యింటికేగి నిర్భయముగా తలుపు దట్టెను. రెండుమూడు సారులు పిలువగా నాయన నిద్రనుండి మేల్కొని వీధితలుపు దెఱచి కంఠస్వరమున వచ్చినవాని నాన వాలుపట్టి గాఢముగా కౌగలించుకొనెను తలుపు తెఱచినశబ్దమును విని నారాయణదాసు విశ్వనాథము గొంతుక నానవాలుపట్టి తనవీధి గది తలుపు గూడ దెరచెను. బావమఱదు లిద్దరును గూడ పలుకరించు కొనిరి సుబ్బారావు వీధితలుపు బంధింపవలదని భార్యకు దెలిపి తానును విశ్వనాథమును నారాయణదానును గలిసి వీధిగదిలో బ్రవేశించి తలుపు నోరగిల బెట్టి దీపమును వెలిగించిరి.

ఆరాత్రి పదిపదిహేను నిమిషములవఱకు ముగ్గురును గుసగుస లాడుకొనిరి. సుబ్బారావు వారలను నిద్రబొండని చెప్పి తనదుస్తులను ధరించి, తిరిగి వచ్చువఱకును మేల్కొనియుండవలయును అని భార్యకు

దెలిపి తనబైసికిలుపై పోలీసుస్టేషను కేగి యొక హేడ్డును, పదుగురు కనిస్టేబులను పిడపర్తిలో గుడిసె గావలిగాయుచున్న మువ్వురను బంధించి, యింటనున్న సామానునంతయు దీసికొనిరమ్మని పంపి, తిరిగి తానింట కరుదెంచి దుస్తులను దీసివైచి ఆనందపరవశుడై నిద్రబోయెను.

ఆముగ్గురును బంధింపబోయిన హేడ్డును కనిస్టేబులును పిడపర్తి గ్రామమునన్న గుడిసె నుదయ మేడుగంటలకు జేరిరి వారేగు నప్పటికింకను గుడిసెలోనున్నవారు నిద్రనుండి మేల్కొనలేదు. వెను కటిరాత్రి ముగియువరకును పరుదెంతుమని చెప్పిపోయిన దొంగరాము డును తక్కినవారును జెప్పినవేళకు రాకుండుట, నాదినమంతయును రాత్రి చాలవఱకును వారికొఱకు గుడిసె కావలిగాయుచున్న ముగ్గు రును నిరీక్షించుచుకొనియుండిరి. ఉదయ మగునప్పటికైన నరుదెంతురను నమ్మకముతో వారు రాత్రి నిద్రించుటచే తలుపుతట్టిన శబ్దము విని, ముగ్గురును లేచి తలుపునొద్ద కరుదెంచిరి. తలుపు తెఱవబడెను. వెంటనే కనిస్టేబు లారుగురును లోనికి జొరబడి యాశ్చర్యమగ్నమానసులై యున్న యాముగ్గురను బంధించి యావలకు లాగిరి. ఇల్లంతయు సోదాచేయబడె కాని వారికాయింట విశేషముగా ధనముగాని, సామగ్రిగాని లభింపలేదు. ఆముగ్గురుదొంగలను దీసికొని ద్వారపూడి జేరి రైలుపై మధ్యాహ్నము మూడుగంటలకు కనిస్టేబులు కాకినాడ జేరిరి. ఆగుడిసెయందు గలసామానునంతయును దీసికొని హేడ్డు సాయంకాల మారుగంటలకు పోలీసుకచ్చేరి జేరెను. దొంగలు ఖైదులో నుంపబడిరి

ఆయుదయమున నిద్ర మేల్కొనినతరువాత సుబ్బారావుగారు విశ్వనాథము, నారాయణదాసును లేచి మాటలాడుకొనుచుండగా నాగదియందు ప్రవేశించి అగ్గిరాము డావెనుకటిదినమున తనయింట

జేసిన విచిత్రచర్యను గుఱించియు, నాతడు పారిపోవుచు దారిలో గొల్ల పాలెమున కేవలజేసిన దొంగతనమును గురించియు కడుపుబ్బ నవ్వుచున్న బావమఱదుల కెఱింగించెను.

" ఇప్పటికైనను మీ కగ్గిరాముని సంగతి పూర్తిగా తెలియ దనియే నాయభిప్రాయము. అంతటి దొంగయు, సాహసికుడును, కరుణాయత్తచిత్తుడును మనకు దఱచుగా గనుపించడు. మీయింట జరపిన దొంగతనమున కేమిగాని వాడీమధ్య నీపురములోని యధికారుల క్షేమైన తనప్రజ్ఞ జూపియుండెనని మీరు వినియుంటిరా? అని విశ్వనాథ మాయనను జూచి పల్కెను.

కలెక్టరుదొరగారి కాత డేదియో యొక యుత్తరమును వ్రాసినట్లు దగ్గరనున్న మనిషివలన కొంచెము వదంతి కలిగినది. కాని తరువాత జరిగినయంశము లేమియు మాకు దెలియలేదు. దొరగారీ యుదయముననే తిరిగి మకామునుండి బయలుదేఱి వత్తురని వర్తమానము తెలిసినది.

అట్లయిన జెప్పెదను వినుడు. అని విశ్వనాథము తన కగ్గిరాముడు తెలిపినరీతిని నోకయుష్టిర మైనను మారుపకుండ యావద్వృత్తాంతమును వారి కెఱింగించెను.

అగ్గిరాము డనిన కలికాలపు మైరావణునివలె నున్నాడే! పెట్టెను దొంగిలించుట యొక్కటి నిర్భయముగా దానిని తిరుగ దీసికొనిపోయి స్వయముగా దొరగారికొప్పజెప్పుటయొక్కటి. రెండును మైరావణుని చర్యలలో జేరినవే అని నారాయణదాసు తనయాశ్చర్యమును దెలిపెను.

ఇన్ని దినములనుండియు, పేరెల్లరును నిర్భయముగా నీచుట్టు ప్రక్కల సంచరించుచున్నను, చుట్టుప్రక్కలననే—మనయొద్దనే సంచరించుచున్న వారు మనచేత బడకుండుటకు గారణము నెఱుంగు

దురా? మారువేషములను ధరించుటయందు వారెల్లరు నద్వితీయులు, ఏవేషమునకునైనను, సరిపడు సామగ్రి నంతయు వారెల్లరును నిమిషములో సమకూర్చుకొని, యావేషమున కనువగు రీతినే మెలంగుటయందు సమర్థులు ఆమధ్య నొకదినమున దొంగరాముడు బ్రాహ్మణవేషమును ధరించి అనపర్తిలో నొక గృహస్థునింట రాత్రి భోజనముచేసి యింటిగుట్టంతయు పైన తిరుగాడు చున్న మాకెఱింగించెను. నేనుకూడ వారియొద్ద వేషములను ధరించుటయందుగలనైపుణ్యముపారమునివములతో నేర్చుకొంటిననిన నాశ్చర్యము నొందవలదు. వారెంతకైనను తగినవారే! కాని వారియొద్దనున్న నీతియును, నుదారతయు నేమహాయోగికైనను నేమహారాజునకైన నుండుటరుదు. నేను వారితో మూడుదొంగతనముల గంటిని కాని వారెన్నడు నొక్కనినైన హింసింప యత్నించరు నాకంట బడ లేదు. ధనికులను దోచికొని బీదలను బోషించుట నూమతమని వారు గర్వపడుచుందురు. అట్టి దొంగజన్మము సామాన్యముగ మానవులకు లభింపదు. వారియెడ తగినంత సానుభూతి గనబఱచి విచారణయందు వారికి గొప్పశిక్షలు లభింపకుండునటుల జూచు భారమంతయు మీదే" అని విశ్వనాథము వేడుకొనెను.

"అది మనమెట్లు చేయగలము? నాశక్తి యున్నంతవఱకు నాకు మాటరాకుండ వీలుగలయంతవఱకు వారిపై నేరమును తగ్గింప దలంతును. ఆపైన వారి యదృష్టము. అన్నట్లు చెప్పనుఱచితిని. ఈ మధ్య నగ్గిరాముడు నాకొకరాత్రి దర్శనమిచ్చి పోయినాడు. నేను తల బద్దలుకొట్టుకొనుచున్న యొకహత్యా విషయమై నాకు వర్తమానమును స్వయముగా నిచ్చి పోయినాడు" అని సుబ్బారావు హత్యావిషయమును గుఱించియు, తన ప్రయత్నమును గుఱించియు, నగ్గిరాము డిచ్చిన సహాయమును గుఱించియు విపులముగా వారి కెఱింగించెను.

అగ్గిరామున కీవిషయ మెల్లు తెలిసియుండునో యని నాకుచాల నాశ్చర్యము కలుగుచున్నది. అతడిచ్చిన వర్తమానమే నాకు చాల తోడుపడినది. ఆనేరమునకు సాక్షినిగూడ యాతడు కట్టి పడవైచి పోయినాడు. అని సుబ్బారావా విషయమును గూడ దెలిపెను. విశ్వనాథము కొంచెముకాల మాలోచించి "ఏదయిన దొంగతనము జరుపుటకై యాల డాయింట ప్రవేశించి యుండవచ్చును. ఇనుపపెట్టెను దెరువగా నాలనికంట నీఖండింపబడిన దేహము కనుపించగా నాతడెన్నడును రక్తమును గంటజూచినవాడు కాకుంటచే కోపము జనింప మీకీ వర్తమానము నిచ్చి యుండవచ్చును" అని తన యభిప్రాయమును దెలిపెను.

ఈ రీతిగా వారు ముగ్గురును గొంతవఱకు మాటలాడుకొనిన తరువాత సుబ్బారావు స్టేషనుకేగి తనపని జూచుకొని జైలునకుపోయి ఖైదీలను వారిమాటల మిమ్మనని యడిగెనేగాని యెవ్వరును నోరు కదల్పకుండుటచే తిరిగి యింటి కరుదెంచి తన మిత్రులతో భోజనమొనరించి కూర్చుండెను.

"ఈరాత్రి నేను తిరిగి ప్రయాణమై పోవలయును. కథానాయకు నన్వేషింపవలయును. మీగడువు దాటకుండ వానినిగూడ మీ కప్పజెప్పితినేని నాపని పూర్తియగును. దానిచ్చటనే యుండగలడు" అని విశ్వనాథము తన నిశ్చయ మెఱింగించెను.

## 17

ఆరాత్రి పదిగంటలకు కాకినాడనుండి యొకడై రాగి వెలువడి వడివడిగా నడచుచు మధ్యమధ్య దిక్కుల నతిజాగ్రతగా పరిశీలించుచు కాలునగట్టునకు — దుర్గకోటకు ప్రయాణమై పోవుచుండెను. అతని

యొద్ద ధరించిన వస్త్రములు తప్ప మతేమియు లేవు. తలకొక మాసిన తరుణారుణవర్ణము గల యంగవస్త్రమును, ఆరంగేగల యొక పెద్ద చొక్కాయియు, తాటిమట్టలతో చేయబడిన పాదరక్షలును మాత్రమే యాతెడు ధరించి యుండెను ఆతని యెడమచేతియందొక కమండలు వుండెను. చంకనొక భిక్షాపాత్రయు, కుడిచేతియందొక కర్రయునుం డెను. ఆతడు మార్గమున నడచుచు, నడుమనడుమ వెనుకకు దిరిగి జూచుచు, సాధ్యమగునంతవఱకు చీకటిచాటుననే మసలుచు, నను మానాస్పదునివలె సంచరించుచుండెను. రాత్రియంతయు నాతడా రోడ్డుననే విశేషము పనియున్నవానివలె, వడివడిగా నడచుచు, వెనుకకు ముందునకు బచారుసేయుచు, నిరాశజెంది యెట్టకేలకు దయ మూడున్నర గంటలకు చామర్లకోట కాలువదాటి యావలిగట్టున చెట్లనీడను నిద్రాపరవశుడాయెను.

మాపాఠకుల నొక్కింతకాల మావెనుకటిదినమున సుబ్బారావు గారి యింటనుండి యుదయమున నాయన దుస్తులను గైకొని పారి పోయిన యగ్గిరాముని వెంబడింపవేడుచున్నాము. సూర్యోదయ మగు నప్పటి కాతడు కాకినాడకు సుమారు రెండుమైళ్ళ దూరముననున్న వాకలపూడి యను గ్రామముజేరి తిన్నగా శూద్రగూడెములోనికి బోయి తన యొద్దనున్న రూప్యములలో రెంటి నచ్చట నొకవృద్ధునకిచ్చి తనరాక నెవ్వరికెఱింగింపవలదని వేడుకొని యాతనియింటనే భుజించి నిద్రాపరవశుడై సాయంకాలమువఱకును బండుకొని తిరిగి భోజనము జేసి ప్రయాణమై రాత్రి 10 గంటలకు పిఠాపురముజేరి కుక్కుటేశ్వరు నాలయప్రాకారమున విశ్రమించెను. ఆతడు ధరించిన పోలీసుదుస్తుల నెల్ల మూటగాగట్టి తన తలక్రిందనుంచుకొని శయనించెను. ఉదయము మూడుగంటలకు నిద్రనుండి మేల్కొని యాతడు సూర్యోదయము కాకమునుపే పెద్దాపురముజేరి పాడువడిన కోటలోని తన నివాసస్థాన

మున జేరి తన వేషము నంతయు మార్చివై చెను. వంటజేసికొని భుజించి బడలిక పూర్తిగా తీరిపోవునట్లు సాయంకాలమువఱకును సుఖముగా నిద్రపోయెను. సాయంకాల మాంత యూరిలోనికేగి స్నానమునొనరించి శుచియై, సామాన్యసంసారియగు నొక క్షత్రియునివలె వేషమునుదాల్చి తనకుపయోగించెడు సామానునంతయు, నొక చిన్న ట్రంకుపెట్టెయందు నర్దుకొని, రాత్రి 10 గంటలకు చామర్లకోటజేరెను. అచ్చట రైలు స్టేషనులో వారును వారును మాటలాడుకొను మాటలవలన, విన్నన్న బైరాగి నుండి తప్పించుకొని పారిపోయెనని యాతడెఱుంగుట కవకాశ మేర్పడెను. సుబ్బారావుగారాదినమున హత్యావిషయము పరిశోధించి, సాక్ష్యము మొదలగు సంగతులను సమకూర్చుటకై చామర్లకోట కరుదెంచి, యారాత్రి తిరిగి కాకినాడ కేగుచుండెను. అతడొకరిద్దఱు స్నేహితులతో నచ్చట ప్రసంగించుచు గూర్చుండెను. ఆయనను గుర్తించి, మారువేషమున నున్న అగ్గిరాముడాయనను సమీపముననే తనముఖము సరిగా కనబడని విధముగా గూర్చుండెను. ఒకవేళ సుబ్బారావాతని జూచినను గుర్తింపలేని రీతినే అగ్గిరాముడు తనవేషము నంతయు మార్చివైచెను. ఆమిత్రుల సంభాషణవలన పైవిషయ మగ్గిరాముడు గ్రహింపగలిగి కాకినాడ కేగవలెనని వచ్చినవాడు, సుబ్బారావుగారిని చూచి, యారాత్రికి కాకినాడ ప్రయాణమును మాని వేయ నిశ్చయించుకొని రైలు బయలుదేరువఱకు నచ్చటనే గూర్చుండి, ముందేమి చేయవలయునాయని విచారించుచుండెను. ఇట్లొకపావుగంట వఱకును జింతించి, యాతడు లేచి, తన ట్రంకుపెట్టెను, గైకొని, బసివిరెడ్డిగారి సత్రము నొద్దకుబోయి, బండి నొకదానిని మాటలాడుకొని బిక్కవోలునకు బ్రయాణమాయెను.

బైరాగి నిద్రనుండి మధ్యాహ్నము నాలుగుగంటలకు మేల్కొని చామర్లకోట యూరులోని కరుదెంచి తన భిక్షాపాత్రమునం దున్న

రెండణాలకు ఫలమునుగొని, భుజించి, సాయంకాలమగువఱకు నానమీా పమునసే సంచరించి, రాత్రికి సత్రమునభుజించి, రైలుస్టేషనున కరు దెంచెను. ఆతడును సుబ్బారావు నానవాలుపట్టి యా సమీాపమునసే వేటొకమూల గూర్చుండి, యాయనచెప్పు నంశములను వినుచుండెను. రైలుకై యరుదెంచినవాడు రైలెక్కకయే రైలేగినతరువాత తిరిగి యూరిలోనికేలపోవలయునని యాతడనుమానించి స్టేషనువిడిచి పోవు చున్న యాసామాన్యక్షత్రియ వంసారివేషమునున్న వానిని కొంత దూరము వెంబడించి యాతడు బండ్లయొద్ద నాగుటయును, బండి మాటలాడుకొని, దానిపై బిక్కవోలు, ప్రణయమై పోవుటయు, జూచి, రైలువేళమఱచి, యీాతడు కాకినాడబండికరుదెంచి, తా నెక్కవలసిన రైలుగాదని గ్రహించి, తనయవసరముకొలది బండిపై రాత్రికి రాత్రిబిక్కవోలితజేరుచుండవలయును" అని తనలోతానను కొనెను. ఐనను నొంటరిగా బండిపోవుచుండుటచే, పరుల కుపకారము చేయుటయే తనపనిగావున నాభై రాగి, బిక్కవోలువఱకు నాబండి దృష్టిపథమును దాటిపోకుండునట్లు వెంబడింపవలయునని, తానదృష్ట వంతుడేయైనచో తానాడబోయిన తీర్థ మెదురుకాకూడదా యనియు దలంచి, బండివెనుక సుమారరువది డెబ్బది గజములదూరమున వెంబ డించెను. సాధ్యమగునంతవరకు కగుపడకుండునట్లాతడు చీకటిమాటుగనే వెంబడించుచుండెను.

బండి యుదయము కాకపూర్వమే, కాలువప్రక్క నాగెను బండివాడు నిద్రనుండి మేల్కొని, చూచుపరి కెవ్వరును బండియందు లేకుండుటచే, నాతడు 'కుయ్యో మొర్రో' అని అద్దెపోయినందుకు గోలపెట్టనారంభించెను. ఆగోలనువిని, వెనువెంటనేయున్న విశ్వనాథ మాతావునుజేరెను. అతడు బండివానివలన యావద్వృత్తాంతమును విని,

బండివానినోదార్చెను దొంగలుకొట్టు దినములలో నజాగ్రత్తగా బండిపై నిద్రపోవుటకిది తగినశాస్త్రియని తలంపవలయును. దారిలో నెచ్చటనో భయము జనింప నాబాటసారి చల్లగాజారియుండును. ఇట్లు విశ్వనాథము చెప్పుచుండగా నాబండివాడు బండినిత్రిప్పి తిరుగ నామర్లకోట కేగ బయాణమై తాను కప్పుకొనియున్న బట్ట నిటునటు సవరించుకొనునప్పుడు వీపునకు గట్టిగానేదియో తగులుటచే నాతడనుమానించి, చూచికొనగా నొకకొంగున రెండురూప్యములు కట్టబడియుండెను. సంతోషించి యాతడావార్తను కాలువచెంత దంతధావన మొనర్చుచున్న భైరాగికి దెలిపెను. భైరాగితప్పక తానువెంబడించిన పురుషు డగ్గిరాముడేయనియు, నేకారణముననో యాతడు మార్గమధ్యమున నద్దెను బండివానికొంగునకు గట్టి బండిదిగి పారిపోయెననియు గ్రహించెను. తూర్పు తెల్లవారుటకు బూర్వమే అగ్గిరాముడు పదముల చప్పుడు వలన తన్నెవ్వరో యంటివచ్చుచుంటిరని తెలిసికొని బండివాడు నిద్రించుచుండెనని గ్రహించి చల్లగా బండినుండి తన పెట్టెతో దిగి పారిపోయెను. ఆతడట్లు బండినుండి దిగి, పారిపోవుచు, వచ్చుచున్నవాడెవ్వడాయని చూచుటకై స్థిరోద్యుక్తుడై కొంతకాలమునుండి యెవ్వరో భైరాగికదాయని యనుకొని, ఆసమీపగ్రామమున తన మిత్రుడును, తనవలన నిదివరకు చాలధన మనుభవించినవాడునునగు నొక శూద్రుని యింటికేగెను. అప్పటికింకను గనుజీకటియుండెను. అట్లు పోవుచు కాలువకు స్నానార్థ మొక వృద్ధబ్రాహ్మణుడు నిద్రమత్తున నెత్తికిజుట్టిన యంగవస్త్రముపై నొక పెద్దరాగిచెంబునుంచుకొని వచ్చుచు నాతని కెదురుపడెను. ఆతడించుక చిత్రమాచరింపదలంచి తన పెట్టె నొకచో దాచి, వచ్చుచున్నవృద్ధు డాతని దాటిపోయిన తర్వాత నొకయిటికను చేతబుచ్చుకొని యాతని వెంబడించెను. ఇట్లొక పదిగజముల దూరమేగి ఆయిటికను మెల్లగా నాతనితలపై నుంచి, ఆచెంబును దీసికొని

గినపెట్టెతో కూడ నామిత్రుని యింటికేగి, సామా నచ్చటనుంచి, దంతధావనమొనర్చి తిరిగి తానరుదెంచిన మార్గమున నావృద్ధుని చెంబుదీసికొనిన తావున గూర్చుండెను. ఆవృద్ధుడు కాలువ కేగి తోముకొనుటకై తలవెదకుకొనగా నిటికదొరకెను. ఆమోసము నెఱింగి గోలపెట్టుచు మార్గమున నెచ్చటనైన బడిపోయెనేమోయని దలంచి, వడిపోయిన నిటికెక్కడనుంచి వచ్చినదనియు దలంచి, తిరిగి యింటియొద్దనే పొరపాటున నిద్రమత్తున తానే యట్లు తెచ్చితినేమో యనియు దలంచి విచారగ్రస్తుడై యింటికి మరలెను మార్గమధ్యమున దారసిల్లిన యగ్గిరాముడాతనిదుఃఖము నవలోకించి కాబోలును వానిని బలుకరించెను. వారిర్వురకు నీక్రిందిసంభాషణము జరిగెను.

"ఏమండీ శాస్త్రిగారు! స్నానమునకు కాబోలును మీరేగి తిరిగి విచారగ్రస్తులై వచ్చుచున్నారేమి? మీ ముఖము జూడ విచారగ్రస్తులై నట్లు తోచుచున్నది?"

"నాయనా! స్నానమున కేగుచుండ, దొంగయెవ్వడో నాతలపైనున్న చెంబును దొంగిలించి, దానికిబదులుగా నొకయిటికనుంచి పారిపోయినాడు కాలువకేగి నాకుజరిగిన నష్టమును గుర్తించి, పొరబాటున నేనే యింటమఱచి, నిద్రమత్తున దీనిని దెచ్చుకొంటినేమోనని తిరుగ యింటికి బోవుచున్నాను."

"చెంబుపోవుటయే స్థిరముచేసుకొన్నాను, అంతమాత్రమునకే మీరిట్లు విచారము నొందవలయునా? చెంబుఖరీదేమాత్రముండి యుండును?"

"చెంబుఖరీదెంతైనను, తిరిగి కొనునంతటి సమర్థుడను గాక పోవుటచే యిట్లు విచారింపవలసియున్నది, చాలబీదవాడను; యీ పూట కుండిన రాత్రికి తిరిగి వెదకుకొనవలసియున్నది. మీరెవ్వరు నాయనా?"

ఆమాటలకు హృదయము కరగికాబోలును "నే నెవ్వడనైన నేమి? నాయొద్ద నేదైనచెంబుగలదేమో చూచి యిచ్చెదను. పావు గంటలో వచ్చెదను మీ రిచ్చటనే యుండు"డని చెప్పి, అగ్గిరాముడు పరుగు పరుగునబోయి తాను తస్కరించిన, చెంబును దీసికొని తన పెట్టెను తెరచి ఆచెంబు పట్టెడునన్ని రూప్యము లందుంచి తిరిగివచ్చి యాయన చేతికిచ్చుచు "శాస్త్రిగారు! మీ చెంబు నేనే తీసితిని. క్షమింపవలయును మీరు తిరుగ కాలువకేగి స్నానముజేసిరండు నా వెంట మాత్రము రావలదు. నేనెవ్వడనో తెలిసికొని ప్రయత్నింపవలదు" అని ఆయనను గాలువవైపంపి తానింటికేగి, ఆమిత్రునియింటి నాదినమున నుండుటకు నిశ్చయించికొనెను.

ఆవృద్ధుడును గాలువకేగి ఆ చెంబునందుంచబడిన రొక్కమందల రూప్యముల నంగవస్త్రమున గట్టిగా మూటగట్టుకొని కాలువలో స్నానముజేయుచు తనకృతజ్ఞతను బట్టలేక యావద్వృత్తాంతమును స్నానార్థమరుదెంచిన తనపరిచితులకు కెఱింగించుచుండెను. తిరిగి చామర్లకోటకై బయలుదేఱి పోవుచున్న భైరాగి యీవిషయము నావృద్ధుని చుట్టును జేరియున్న వారివలనను నావృద్ధునివలనను నా మహోదాతయొక్క యాకారవర్ణన మెఱింగి యీ విచిత్రమును జరిపిన యాత డగ్గిరాముడే యని స్థిరపఱచుకొని తానుకూడ నాదినమున నా ప్రాంతముల నుండవలయునని నిశ్చయించుకొని వృద్ధుడింటికి బయలు దేరువఱకు నాగి యాతని వెంబడించి యాతనివలన నాపురుషుడువచ్చి పోయినమార్గము నెఱింగి యామార్గమున నూరిలోనికి బయలుదేరి పోయెను. ఇట్టి యుదారగుణ స్వభావుడగు వానియెడ దానింతెపట్టుదలతో పనిచేయవలసివచ్చినందులకు హృదయమున నించుక విచారించుచు వీలయినచో నాతని నెట్లయిన రక్షించినచో మేలగుననియు, సాధ్యమగునేని యాతని నాదుర్వృత్తినుండి మరల్చుటకే యత్నింప

వలయునని భైరాగివేషము నాతని నన్వేషించుచున్న విశ్వనాథము తలంచుచుండెను. ఎట్లయినను, మిత్రుడైన సుబ్బారావుగారికిచ్చిన వాగ్దానమును ముందుగా నెరవేర్చు టవసరమనియు, లేసివో నాతడధికారుల క్రోధమునకు బాత్రుడగుననియు గూడ నాతడూహించెను.

ఉదయ మేడున్నర గంటలగునరి కాతడా నమీపగ్రామము జేరెను. ఊరంతయు నొకటిరెండుపర్యాయములు ప్రదక్షిణము జేసినట్లు తిరిగెను. కాని వానికెందు నగ్గిరామునిజాడ కనబడలేదు. ఇంకొకసారి తిరిగి యేయింటనైన గొంచెమన్నము యాచింపవలయునని యుద్దేశించి యాత డూరంతయు జాగ్రతగా నాల్గుదిక్కుల బరిశోధించుచు బయలుదేరెను. ఇదివఱకీతడు తిరుగునప్పుడు తానుండిన శూద్రునియింటి కిటకి గుండ నగ్గిరాముడొకసారి భైరాగిని జూచి, యించుక కాల మాలోచించి మిన్నకుండెను. ఆతడు భోజనము జేసి తనమిత్రునితో ప్రసంగించుచు కూర్చుండ నీభైరాగి తిరిగి యావీధినేవచ్చెను. అగ్గిరాముడు లేచి వీధిలోనికివచ్చి తలుపు మఱుగుననుండి యాతనిపరీక్షించి తనయనుమానము నిజమేయని నిశ్చయించికొని "విస్సన్నా!" అని కేకవేసెను. విశ్వనాథము తిరిగిచూచి అగ్గిరాముని గుర్తించి, చిరునగవుతో నాతని జేరెను. ఇరువురును నాశూద్రుడు కూర్చుండిన తావుసజేరిరి. అగ్గిరాముడు విస్సన్నయుదంతము నామిత్రుని కెఱింగించి "విస్సన్నా! నీవెట్లు తప్పించుకొని వచ్చితివి? నిన్న చాపుర్నకోట స్టేషనులో సుబ్బారావుగారు నీసంగతి నెవరితోడనో చెప్పుచుండగా వింటిని" అనెను.

"ఆకనిస్టేబులలో నొకడు నాకు దగ్గరబంధువుగ నున్నవాడు. వాడు నాగదికి కావలిగాయుచు ప్రసంగవశమున నది కావలిగాయు రెండవవానికి మత్తుమందునొసగి గదికి కన్నము త్రవ్వుట కవకాశము నా కేర్పరచెను. ఆతడేమి చిక్కులలో పడునోకాని, నాకు చాల యుప

కారము జేసినాడు. నీవు పారిపోయినవిధము మేమెల్లరమును విని చాల సంతోషించితిమి" అనెను. అగ్గిరాముడు సంతోషించి "విస్సన్నా! మన కార్యవట్టములో జరిగినమోసమునకు గారణ మెవ్వరో నీకేమయిన ననుమానమున్నదా?" అని ప్రశ్నించెను.

"ఏమో దృఢముగా చెప్పలేను. మనమున్న గూడెములోని మాలలు కక్కుఱితిపడి, పోలీసువలన బహుమానము నొందుటకై అట్లు జేసియుందురు. ఏమో నీచులుకదా?"

"కావచ్చును మిత్రుని, తననుపకారిని, మోసము జేసినవానిని భగవంతుడే దండించును. మనము నిచ్చటనే యీమిత్రునింటనుండి మనపని జూచుకొనవచ్చును." అని యాతడు స్థిరపఱచెను.

## 18

అగ్గిరాముడు చెప్పిన కడసారిమాటలు విశ్వనాధము హృదయమున నాటుకొని, బాధింపసాగెను. తనయందు నమ్మకముంచి రహస్యముల వెలిబుచ్చినవానియెడ మోసముచేసినవానికి నుత్తరగతులుండవు. కాని, యయాచితముగా తానొనర్చబూనిన కార్యమున కట్టిసందర్భ పడుచుండుటచే యాదోషము తనయందు లేదని యాతడు స్థిరపఱచుకొని, యేదియో సంగతి జ్ఞప్తికిరాగా నాతడు పరధ్యానచిత్తుడై యుండెను. అగ్గిరాముడది గ్రహించి "ఏమో ఆలోచించుచుంటివి? నన్ను విడనాడి పోవుదుమని నీకు తోచినదా యేమి? విస్సన్నా! నేను నిన్నేవిధమైన [illegible] బెట్టను. నీయిచ్చవచ్చినచో నాతో నుండుము, లేదా [illegible] నీవేగుము" అనెను.

"నేనీ రెండుమూడు దినములనుండియు, మిక్కిలి ప్రయాస పడుచుండుటచే నాహృదయము పరధ్యాన పరమైయున్నది నిన్ను విడిచిపెట్టను. నియుండనేయుండి నాకు వీలగునంత సహాయము నీకు జేయుచుండును" అని విశ్వనాధము చిరునగవుతో నాతని హస్తమున తన హస్తము నుంచుచు బల్కెను.

"విన్ననాన్న! ఇక మనమిద్దర మీయింటనే యుందుదము. ఈ స్నేహితుడు సేవ తాను పనిగొలిపి కింకొక యూరేగవలెనని నిశ్చయించుకొనియున్నాడు కావున నీగృహము మనయధీనమున నుండును. సాయంకాల మిద్దరమును బయలుదేరి, నాపూర్వపు మకామునకేగి సామగ్రినంతయు దెచ్చికొనెదము. భోజనమైనదా? లేనిచో లెమ్ము స్నానముజేసి వంటజేసికొనుము." విశ్వనాధ మీమాటల కానందము గనబఱచి లేచి వంటప్రయత్నము జేసికొనబోయెను. అగ్గిరాముడును అశూద్రమిత్రుడునుగూడ వానికుపకరణములను సమకూర్చుట కాతడు వంటజేసికొను వసారాలోనికేగి యాతనికి దోడ్పడుచు నేదియో లోకాభిరామాయణమును విచ్చలవిడిగా మాటలాడుకొనుచుండిరి. విశ్వనాధము చామర్లకోటనుండి, యా లెనివెంబడించినసంగతి నగ్గిరామునితో జెప్పెను అగ్గిరాముడు తనకనుమానము జనింప బండిలోనుండి దిగి యామిత్రుని యింటకరుదెంచిన గాధను, మార్గమున జేసిన చిత్రమును దెలియబఱచెను. ఒకరిసంగతి నెఱింగి రెండవవారు పకపక నవ్వజొచ్చిరి.

భోజనమైన తరువాత నెల్లరును విశ్రమింపతలచి పండుకొనిరి. కొలదికాలములో వారు శ్రమనొంది యుండుటచే కాబోలును గాఢ నిద్రామగ్నులై యాలోకమును మఱచిరి. చీకటి పడుచుండగనే వారు నిద్రనుండి మేల్కాంచి, భోజనములొనర్చి యాశూద్రునితో తప్పక

మఱునాడురాత్రి కఱదెంచుట నిశ్చయమనిచెప్పి అగ్గిరాముడును, విశ్వనాథము ను పెద్దాపురము ప్రయాణమైరి.

రహస్యాపరాధపరిశోధనలయందు బేరుజెందిన విశ్వనాథమును, దొంగతనమునందు జిల్లానంతయు గగ్గోలుపెట్టిన అగ్గిరాముడును మారు వేషములలో నల్లాపముల నాడుకొనుచు, పరమమిత్రులవలె పోవుచుం డిరి. ఇది స్వభావవిరుద్ధముకూడ కానేరదు. శరీరలక్షణవేత్తలను భవము వలన ఘనకీర్తిని సంపాదించు దొంగకును రహస్యపరిశోధకునకును రూపురేఖలందు వ్యత్యాసములేదనియు వారు పొందు శిక్షోపద్ధతుల ననుసరించి వారివృత్తులు భేదించునేకాని ముఖవర్చస్సునను ఇతరశరీర లక్షణముల నొక్కటేయనియు జెప్పుచున్నారు. అగ్గిరాముడు రహస్యా పరాధపరిశోధకుడే యైనచో విశ్వనాథమువలెనే పేరుగాంచి యుండు నేమో!

అట్లామిత్రులిర్వురును పెద్దాపురము బోవుచుండగా, మార్గ మధ్యమున విశ్వనాథ మగ్గిరాముని పూర్వచారిత్రమును జెప్పవలయు నని చాల ప్రార్థించెను. ఎట్టకేల కగ్గిరాముడు సమ్మతించి పెద్దాపుర మేగువఱకును దనగాథ నిరివిగా నెఱింగించెను. అందు మనకు ముఖ్య మైన సంగతులనెల్ల గ్రోడీకరించి పాఠకులకెరింగించెదము. అగ్గిరాముని చర్యలెల్ల లోకవిదితమే కావున నాతడి వృత్తి నేల ప్రవేశించెనో పాఠ కుల కెఱుంగజెప్పుట చాల యవసరము. అతడు వచించినవిధమునే తెలియజేయుచున్నాము.

"జనులనుకొనునట్లు నేను మాలవాడనుగాను. శూద్ర వంశ జుడను, నాజన్మస్థలము. పెద్దాపురమునొద్ద నొకగ్రామము; నాజనకుడు చాలకాలము చెన్నపట్టణములో నొకకంపెనీలో పనిచేయుచుండుటచే

నావిద్యాభ్యాస మంతయు జెన్నపట్టణముననే జరిగెను. నేనచ్చట నాల్గవఫారమువఱకును విద్య నభ్యసించితిని. నాతల్లి గతించుటచే నా తండ్రి యుద్యోగమును జాలించి స్వగ్రామమున కరుదెంచి, విశ్రాంతి బడయనెంచెను మేమిర్వురమును పెద్దాపురముజేరితిమి. వేసవికాలపు శెలవులగుటచే నేనుతిరిగి విద్యనేర్చుకొనుట కచ్చటకునుబోవక, నా తండ్రితోనుంటిని; నాకప్పుడు పదునేడవయేడు; ఇట్లు మేమరుదెంచిన నెలదినములకు మాదురదృష్టవశమున చెన్నపట్టణమున నాతండ్రివలన నవకారమునొందిన పోలీసిన్స్పెక్టరు పెద్దాపురమునకు బదిలీ చేయ బడెను. నాతండ్రికంపినీవిషయమున మోసము దలపెట్టిన యీతని దురుద్యమమును కంపెనీవారితో జెప్పి తనమూలమున పై అధికారుల కెఱిగించి, యాతనినుద్యోగమునుండి కొంతకాలమునస్పెండు జేయించెను. ఆతడావిషయమును మనమున నిడుకొనెను. కొలదిదినములలో నాతడు మేమున్నతావును గనిపెట్టెను. నాటినుండియు నాతడేదియో యొకవిధమున మమ్ముల బాధించుచుండెను. ఇట్లొకవారము పదిదినములు జరిగినవెనుక నే నింటలేకుండ జూచి యాతడు నాయింట బ్రవేశించి నాతండ్రిని బెదరించి, యింటిలోనిసామానునంతయు స్టేషనునకు దీసికొనిపోయి నాతండ్రిని చోరీయాస్తిని గొనినాడనియు, శిక్షార్హుడనియు, ఖైదులోనుంచెదననియు బెదరించెను. నే నింటికరుదెంచువరకి నాతండ్రి తన వార్ధక్యమున సంభవించిన యీపరాభవమునకు వగచి పై అధికారి కీతనిదార్జన్యమున దెలుపవలయునని ప్రయాణమై మనోవ్యధచే దేహము కంపింప ముందడుగుబెట్టలేక మితిలేనియాయాసము జనింప మంచముపై బడి యిపుడో యింకనో యనునట్లు పడియుండెను నేనీవృత్తాంతమంతయు నాతనివలన వింటిని. నేనేగి పై యధికారుల నెఱింగించుటకు నాతండ్రియవస్థవలన వీలుగలుగలేదు. అప్పుడే నేను నాతండ్రి కీదురవస్థదెచ్చినవానిపై కసిదీర్చుకొన ప్రతిజ్ఞజేసుకొంటిని.

అదివిని నాతండ్రి "నాయనా! ఎన్నడును రక్తమును మాత్రము నీ కంటజూడవలదు. అటుకాకుండ నీయిచ్చవచ్చినట్లు నీకసిదీర్చుకొనుము అదియేనాదీవన" అని ఆశీర్వదించిపరలోకగతుడాయెను. ఆతని యంత్య క్రియలను జరిపి నేనాయూరునను.గలేక రెండు మూడు మాసముల వఱకు నటునిటు దిరుగుచు నాయిన్స్పెక్టరు స్థితిగతులను కనుగొను చుంటిని. ఒకదినమున నల్లచెరువు సత్రమున నేను ఐరుండియుండగా నేదోయొకకేసుపై యాతడు నాసత్రమున కరుదెంచి మకాముజేసెను. సమయము లభించినదని తలంచి యాతడొంటిగాయున్న సమయమున నాతని గది ప్రవేశించి యాతనిసామానును చల్లగా దీసికొనివచ్చుచు నొకకాగితముపై "ఛండాలుడా! నిన్ను చంపదలంచక పోవుటచే బ్రతికితివి. నాసంసారమునకు దెచ్చినయపవాదునకును నష్టమునకును నీ కిదియేశాస్తి. అగ్గిరాముడు నిన్నింకను వదలడు" అని వ్రాసి యాతని గుండెపైనుంచి వానిసామానుతో పారిపోయితిని, ఆసామానులో నాతని కాకితములును కూడ కొన్నికలవు నేనువాడుచుండిన పిస్తోలాతనిదే అగ్గిరాముడనునామము నా దినముననే ధరించితిని. నాపూర్వపునామము వేంకటస్వామి ఆపేరకస్మాత్తుగా స్ఫురించుటచే నేటివఱకు నదియే వాడు చుంటిని. ఇక చెప్పనదేమున్నది. నాటితో స్థిరపడినది. ఇక దొంగనై లోకోపకారము జేయమొదలిడితిని. ఆయిన్స్పెక్టరు గ్రామమున నుండునంతకాలము నాతనియింట నేసామాను నుంచెడివాడనుగాను మారువేషములను ధరించి మాయోపాయములతో నాత డాయూర నుండుటకు భయపడునట్లుజేసితిని. ఆతడన్నిదొంగతనములను నాతలపై పెట్టుచు, నన్ను బట్టుకొనుటకు బ్రయత్నము లాచరించుచు నా గ్రామ మునుండి బదిలీచేయించుకొని, దూరముగా పారిపోయెను. ఈ పండ్రెండు సంవత్సరములనుండియు నే నీవిద్య కనువగునుపాయముల నన్నిటి సమార్జించితిని. దేహమును బలపఱచుకొంటిని.

మిత్రు లిర్వురును పెద్దాపురమింకను జీకటియుండగనే జేరి పాడుబడిన కోటలోని యగ్గిరాముని నివాసస్థలమునకేగి విశ్రమించిరి. వారచ్చటనే వండికొని భుజించి హాయిగా సాయంకాలమగువఱకును విశ్రాంతి దీసికొని చీకటిపడినవెంటనే ముఖ్యమైన సామానులంతయు దీసికొని తిరిగి తెల్లవారుసరి కేర్పఱచుకొనిన నూతన నివాసమును జేరి ప్రయాణమై పోదలంచిన యాగృహాధిపతిని సాగనంపి బడలియుండు టచే నిద్రాపరవశులైరి. మధ్యాహ్నము భుజించినతర్వాత నగ్గిరాముడు విశ్వనాథముతో భావినిగుఱించి యిట్లు చర్చించెను.

విశ్వనాథ! నేటిరాత్రి బయలుదేరి నేను రాజమండ్రి కేగి యొకయధికారియింటి కొకసారి పోవలయునని యున్నది. అది చాల అపాయకరమైయైనను, చేయవలసియున్నది. ఏలనందువా! ఆతడు చాల ముక్కోపియని ప్రతీతి. ఆతనికొకసారి దర్శనమిచ్చినగాని, బాగుండదు. ఇన్నిదినములనుండియు నాతడునాపై కారములను మిరియములను నూరుచున్నాడు. ఆతనికొకసారి నాసామర్థ్యమును రుచిచూపింపవలయునని యున్నది. మనగుంపంతయు పోలీసువారిచేతులలో బడినది. వారినేదైన నుపాయముపన్ని జెయిలునుండి తప్పించుకొనున ట్లేర్పాటులు జేసిరావలయును. రాజమండ్రికేగి ప్రయత్నములన్నియు జేసికొనిరావలయును. నేడో రేపో మనవాండ్రను రాజమండ్రి పంపెదరు. ఐనను నీవుకూడ నేదైన మారువేషము ధరించి, కాకినాడ కేగి వీలగునేని మనవారలకు ధైర్యముజెప్పి యావద్వృత్తాంతముల నెఱింగి రావలయును, నేడు చతుర్దశికదా! విదియనాడు చీకటిపడునప్పటికి నేను తిరిగివచ్చెదను. నీవీవర్తమానము నంతయు దెలిసికొని నే నరుదెంచుసరి కిచ్చటకు రావలయును. వీలగునేని నాకుగూడ వండియుంచుము. నీవు కాకినాడలో చాల జాగ్రతతో మెలగవలయును. తిరిగి

నీవిచ్చట కరుదెంచునప్పు డెవ్వరును వెంబడింపకుండ జూచుకొనవల యును. ఈసాయంకాలమే బయలుదేరి పోవుదము. నీవాదినమునకు రావేని, నీవుకూడ వారిచేత జిక్కితివని యనుకొనెదను. నేను రాని యెడల నీవధైర్యమునొందక యిచ్చటనే యుండవలయును. నాకేవిధ మైన విపత్తును రాదులెమ్ము."

"తప్పక నే నావేళకే యరుదెంతును. నీవుమాత్రము జాగ్ర తగా నుండినచో మాకెన్నడు నేవిధమయిన లోటును గలుగదు" అని విశ్వనాథము తన నిశ్చయ మెఱింగించెను.

## 19

విశ్వనాథ మానాడు సాయంకాలమైన వెనుక చామర్లకోటవఱ కును నడచిపోయి యచ్చట రైలునెక్కి రాత్రి 12 గంటలు దాటిన తర్వాత కాకినాడ ప్రవేశించి, తిన్నగా సుబ్బారావుగారి యింటికేగి దానును లేపి పండుకొనెను. అగ్గిరాముడు బిక్కవోలువఱకు నడచి పోయి సూర్యోదయమున కాకమునుపే రాజమండ్రి జేరెను. అతడు మారువేషమున నుండెను. తన శిరోజములను దగ్గరగా కత్తెరవేయించి మీసముదీసివైచి, నామములను ధరించి సాతానివలెనుండెను. అతడు తిన్నగా కంభమువారి సత్రమునకేగి యచట బస జేసెను.

రెండుదినములవఱ కాతడాయూరనే మకాముజేసి తనపని నంత యుదీర్చికొన ప్రయత్నించుచుండెను. పాడ్యమినాడు సాయంకాల మాతడాయధికారిని జూడబోయి యాయన బంగాళయరుగుపై చాల వఱకుగూర్చుండెను. కాని యాతని అఱియు గఱియుగ గొనువాడు లేకుండెను. ఒంటిగానున్నప్పుడా యధికారిని గనుగొనవలెనని యాత

డొకమూలకూర్చుండుటచే లోపలికేగి తిరిగివచ్చువారి కాతడు గోచ రింపకుండెను. ఇట్లొక రెండుగంటలవఱ కాతడు గూర్చుండెను. తా నెవరికొఱకరుదెంచెనో యాతడీవలకు రాకుండుటయు, నాప్రక్కపసారా యందుండినట్లు స్ఫురించుటయు, జూచి అగ్గిరాముడా ప్రక్కకు దొంగిజూచెను. ఆతడొక్కడే యుండెను. చేతిలో నేదియోగ్రంథము నుంచుకొనియాతడు తనకోటును పడకకుర్చీకి దగిలించియట్లే కునుకు చుండెను. అగ్గిరాముడు మెల్లగ నాతావునకుజేరెను. ఆయనకు మెలకువ రాలేదు. రెండునిమిషములవఱకు జూచి యతడు విసిగి యిక నిద్ర నుండి మేల్కొనడని గ్రహించి, యా చెంతనున్న కోటును మెల్లగ గైకొని పలాయితుడాయెను. రాత్రిపదిగంటల కాతడు తనబసజేరి, ఆ కోటు నొక బంగీగా కట్టి లోపల "అగ్గిరాముడంపినాడు" అని యొక కాగితముపై వ్రాసియుంచి, ఆబంగి మరునాడు పోష్టులో బంపవలయు నని నిశ్చయించుకొని, బండికట్టించుకొని తెల్లవారునరికి కడియము జేరెను. ఆసాయంకాలము చీకటిపడునరి కాతడు తిరిగి తననివాసమును జేర వచ్చుచుండెను. ఆయుధకారి నిద్రనుండి మేల్కొని, లోనికిపండు కొనబోవునప్పుడు తనకోటుకై చూచుకొనెను. అది కానబడకుండుటచే నింటిలోనుండెనేమోయని లోనికేగి వెదకెను. తనకెందును కోటు కనబడకుండుటచే ఆతడు బంట్రోతులను బిలిచి వారిని దూషించి వెదకుట కాజ్ఞనిచ్చెను. ఎందువెదకినను గానరాలేదు. బంట్రోతులను పనినుండి తీసివైచెదనని బెదరించి కలగినపసన్నుతో నాతడు నిద్ర బోయెను. మరునాడుదయమున గూడ యాతడు వెదకించెను. కాని లాభము లేకపోయెను, ఆకోటు బంగిగా కట్టబడి, కడియము పోష్టాఫీసు లోనుండి తన పేర నంపబడుచుండెను.

విశ్వనాధ మామరునాడుదయముననే మేలజేరి, దాసును లేపి యా తనితో చాలవఱకు రహస్యముగ మాటలాడెను. ఇంతలో సుబ్బా

రావుగారు కూడా కాఫీ, ఫలహారములను దీసికొని, యాగదిలోని కరు దెంచెను. విశ్వనాథ మాయనను గూర్చుండ నియమించెను. ముగ్గురును ఫలహారములను జేసిరి

"సుబ్బారావుగారు! మీపని నెరవేరినది. ఇక మూడవనాడుద యమున మీకగ్గిరాముని దర్శనము జేయించెదను మీరేయనుమానము నొందవలదు"

"మీయనుగ్రహమువలన దిరిగి నాతిండి నాకులభింపగలదు. ఏమేమిప్రయత్నములను జేయవలయునో సవిస్తరముగా తెలిపినచో నేను సిద్ధముగా నుండెదను."

"మీరేవిధమైన ప్రయత్నములను జేయనవసరములేదు. ఆనా డుదయముననే మీరు నాగది తలుపు దీయునప్పటికి కగ్గిరాముడం దుండును మీరు భయపడవలసిన యవసరములేదు. మీరుమాత్రము వానినేమియుననవలదు. మీరేకాదు మీజవానులాతని నెంతమాత్రము నిందింపవలదని శాసింపవలయును. దానికేమికాని మిగిలిన వారింకను నిచ్చట జెయిలులోనున్నారా? లేక రాజమహేంద్రవరము వారిని బంపి తిరా? అగ్గిరాముడు వచ్చునప్పటికి వారెవ్వరు నిచ్చట నుండరాదు."

"వారిని రేపు రాజమండ్రి పంపవలెనని ప్రయత్నించుచు న్నాను. రేపుమధ్యాహ్నము తప్పక రాజమండ్రి పంపివైచెదను. ఆ యభ్యంతరముండదు."

"సరే లెండు నేనును దాసు నూరులోని కేగి వచ్చెదము. శెలవా!" అని యిద్దరును దుస్తులను ధరించి యూరులో నటు నిటు సంచరించుచు రహస్యముగా యావద్వృత్తాంతమును మాటలాడుకొని భోజనమున కింటికి వచ్చిరి.

ఆమరునాడు చీకటిపడుసరికి విశ్వనాథమును నారాయణదాసు ను అగ్గిరాముడు నూతనముగా నేర్పఱచుకొనిన నివాసస్థలమును జేరి లోపల బ్రవేశించి తమతో దెచ్చికొనిన ఫలహారమును భుజించి యించుకకాలము విశ్రమించిరి. అనంతరము వారిద్దరును గూడి ఆ యింటి వీధిగుమ్మమునకు గడపకు లోపల మోకాలులోతు గోతి నొక దానిని దీయనారంభించిరి, రాత్రి పండ్రెండుగంటలకు వారిపని నెరవేరు టయు వారు తలుపువైచికొని నిద్రించిరి. ఆమరునాడుదయమున తమ కుగావలసిన సామగ్రినంతయు సిద్ధముగావించుకొని, భుజించి సాయం కాలమగుసరి కతిజాగరూకులై యగ్గిరాముని రాకకు వేచియుండిరి.

అగ్గిరాము డరుదెంచునరికి రాత్రి ఏడుగంటలాయెను. ఆతడరు దెంచి వీధితలుపు దట్టెను. లోపలనున్న యిద్దరును గోతి కిటునటు నిలిచి తలుపుదెరచిరి. లోపల నంతయు చీకటిగనుండెను." దీపమేది ? విస్సన్నా !" అని అగ్గిరాముడు గడపదాటెను. ఆతడా గోతియందు బడెను. నారాయణదాసు తత్క్షణమే యాతనిసందిట బట్టుకొనెను. విశ్వనాథము చురుకుగా నాతని దండలను విఱచికట్టి యతనిపాదములను గూడ బంధించి, మొలనున్న పిస్తోలు నూడబెరికికొని, "మాటలాడి నచో నీపరువు నీకు దక్కదు"అని బెదరించి, వాని నాగోతినుండి నారాయణదాసు సహాయమున నీవలకులాగి చేతులను గాళ్లను తిరిగి బంధించి, దీపము వెలిగించెను. అగ్గిరాము డాశ్చర్యమగ్నమానసుడయి దీపపువెలుగున విశ్వనాథమును గుర్తించి, విస్సన్నా ! ఇంతమోసము దలపెట్టిన నీకు తరగతులుండునా ? పోలీసువారిచ్చు స్వల్పబహుమాన మున కాశపడి, నన్ను బట్టుకొనదలపెట్టితివా ? ఎంత విశ్వాసఘాతకుడ వైతివి' అనెను. స్నేహముచేత నెంతవానిచేనైనను విషము దినిపింప వచ్చును. కానివైరమున నమృతమునైన దినిపింపలేరు. కలిసిమెలసి

తిరుగుచు వారితో భుజించుచు నుండుటచే విశ్వనాథము కగ్గిరాముడు దొరకెను. కన్నులు నిప్పులుగక్కుచు నగ్గిరాముడు తీక్షణముగా విశ్వనాథమువైపు జూచుచుండెను.

"అగ్గిరాముడా! కాదుకాదు. వెంకటస్వామి! నేను విస్సన్నను కాను. నేను విశాఖపట్టణ కాపురస్థుడను విశ్వనాథమనువాడను. ఈతడు నాబావమఱది నేను రహస్యాపరాధ పరిశోధకుడను నిన్ను పట్టి యప్పజెప్పినగాని తనతిండి పడిపోవునని నామిత్రుడగు సుబ్బారావుగారు కోరుటచే నిన్నును నీగుంపును వెంటాడి బంధించితిని. నీయందు నాకొక సద్బుద్ధి పుట్టుటచే, నిన్నెట్లయిన నాతో నుంచికొనవలయునను నుద్దేశముతో నున్నాను దీనికి నిదర్శన మిచ్చుట నెవ్వరును బోలీసువారు లేకుండటయే! ఆవిషయము నీవే యాలోచించుకొనవలయును. నిన్ని దినముననే మేమిద్దరమును దీసికొనిపోయి యుదయమున సుబ్బారావుగారి కప్పజెప్పెదము. ఆయనకు జేసిన వాగ్దాన మప్పటితో తీరిపోవును. నాయందు నీకు క్రోధము వలదు. నేనెవ్వడనో నీకెఱింగించిన నీవలన మోసము జరుగుననియు నిక నాకంట బడవనియు నిన్నిరాత్రి మేమిద్దరమును గూడి యీమాయోపాయముచే నిన్ను బంధించితిమి.

అగ్గిరాము డాలోచించుచుండెను. ఆతని ముఖముననున్న కోపము క్రమముగా తగ్గిపోయెను. ఆతడు విశ్వనాథమువైపు చూచుచుండెను.

"విశ్వనాథముగారి పేరొకసారి వినియుంటిని. ఇన్నిదినములును వారు నాతో మెలగితిరని యిప్పుడు నాహృదయమున నాహ్లాదము జనించుచున్నది. నాకేమిలెండు ఖైదులో మీరు మీమిత్రున కొసగిన వాగ్దానము జెల్లించుకొనుటకు నన్ను దీసికొనిపోవచ్చును. కాని ఖైదులు శాశ్వతములు కావు. అభేద్యములుకావు నాదారినేను చూచుకొన గలను.

అని అగ్గిరాము డేమేమో చెప్పుచుండగ నాతనిమాట కడ్డయి విశ్వనాథము తన హృదయమిట్లు సంపూర్ణముగ వెలిబుచ్చెను.

"నాయొద్ద నిదివఱ కెన్నిదినముల నుండియో విశ్వాసముగా నుండి నాకు పరిశోధనలలో చాల సహాయము జేయుచున్న కొండడను వాడు గతించెను. నాటినుండి నేటివఱకు నాతనిస్థానము నాక్రమించుట కెవ్వరును దగినవారు లభింపలేదు. నేను నీతో నిన్ని దినములుండియు మెలంగుచుండుటచే నీసంగతి బాగుగ దెలిసికొని నిన్ను సన్మార్గమునకు ద్రిప్పుటయే నాముఖ్యోద్దేశముగా బెట్టుకొనియుంటిని. నిన్ను విడ నాడను అని విశ్వనాథమును నారాయణదాసును నాటిరాత్రి చాల వఱకు బంధింపబడిన యగ్గిరామునితో ప్రసంగించి యాతనివలన నవసర మగు వాగ్దానములన్నియు గైకొని యాతని కుపయోగించు మార్గ మును సవిస్తరముగ బోధించి తెల్లవారుటకు బూర్వమే వానిని చామర్లకోటవరకు దీసికొనివచ్చి సూర్యోదయము కాకపూర్వమే తాముండుగదితలుపు దీసి, అగ్గిరాము నందుంచి, సుబ్బారావుగారిని మేల్కొల్పిరి. అగ్గిరాముని ముఖము నవలోకించినచో నాతడు రాత్రి జరిగినసంభాషణమువలన, చాల సంతుష్టినందినట్లు కనబడుచుండెను. అంతియే కాదు. విశ్వనాథము చెప్పినమాటలవలన నిదివఱ కాతనిపై నున్నకోపమంతయు నశించుటయేకాక మితిలేని విశ్వాస ముదయించిన ట్లాతని చూపులే నిదర్శనము.

సుబ్బారావుగా రరుదెంచిరి. ఆయన తన నేత్రములను నమ్మ లేక, విశ్వనాథమును పలుకరించెను. విశ్వనాథమాయన కగ్గిరాముని బంధించి తెచ్చితినని చెప్పి వానిని జూపించెను. వెంటనే యాయన కనిస్టేబులకు కబురంపి, అగ్గిరామునెడ నాయన చూపిన మర్యాదయే విశ్వనాథమువలన యాయన పొందిన మహోపకారముయొక్క విస్తీర్ణ తను చాటగలదు.

"విశ్వనాథముగారు! మీమేలు నేనేమని కొనియాడగలను? పనిలోనుండి తప్పింపబడకుండ నాకడ్డుపడి నాతిండిని నాకు నిలిపిరి. వేయి జన్మములకైనను, నేను మీఋణమును దీర్చుకొనలేను. నాకు మీరుతప్ప గురువును, దైవమును లేడని నమ్ముచున్నాను."

"మిత్రునకు నాచేతనైన సహాయము జేసితిని. దానికంత పొగి డనేల? సుబ్బారావుగారు! నేనుస్తోత్రప్రియుడను గానని మీరెఱింగి యిట్లూరక యీస్వల్పకార్యము నుగ్గడించుట నాకు కోపకారణము కాకపోయినను, మనస్సునకు నచ్చదు. నేనిట్లుంటినని మీరన్యథా తలంప వలదు" సుబ్బారావీ పల్కులవలించి పకపక నవ్వుచుండెను.

"అయ్యా! నాపని నెరవేరినది నేనును మాదాసును, నేటి మధ్యాహ్నమే భోజనానంతరము బయలుదేరి మా యూరేగెదము. మీరుకోర్టుకేగి యగ్గిరాముని మేజస్ట్రీటుగారియొద్ద హాజరు పెట్టవల యునేమో? ఇప్పుడే మాకనుజ్ఞ నొసగవలయును. తరువాత మీకు దొరికియుండడు."

సుబ్బారావుగారు వారినాప నెంతయోప్రయత్నించెను. కాని వారిర్వురు దొందరపనియున్నదని తమమాటనే నెగ్గించుకొని, భోజనా నంతరము బయలుదేరి, విశాఖపట్టణ మేగుటకుమారుగా పిఠాపురమేగి సాయంకాలమువఱ కచ్చటనేయుండి, చీకటిపడినవెంటనే, తమసామా నుతో రైలుస్టేషనుజేరిరి. నాగాయణదా నచ్చట నాసామానునకు గావలియుండె విశ్వనాథము బయలుదేరి, యెచ్చటికోపోయెను.

ఇక గాకినాడలో నామధ్యాహ్న మగ్గిరాముడు కోర్టునకు దీసి కొనిరాబడి మేజస్ట్రీటుగారి యెదుటకు దీసికొనిపోయెను. కోర్టు జనము

తో వ్రిక్కిరిసియుండెను. విశ్వనాధమును నారాయణదాసును, గలసి తీసికొనిరాగలిగిన అగ్గిరామునకప్పుడొక పండ్రెండుగురు పహారాజవానులు గావలిగాచుచుండిరి. మేజస్ట్రీటుగా రడిగిన యేప్రశ్నకు నగ్గిరాముడు సమాధానము జెప్పకుండుటచే ప్రాణమువిసిగి వారాతని దిరిగి ఖైదులో నుంపబడుట కంపివైచిరి మరునాడుదయమున నాతడు రాజమండ్రికి గొంపోబడుటకాజ్ఞ యొసగబడెను. తనగదియందుగూర్చుండి యగ్గిరాముఁడు దీర్ఘాలోచనపరుడై పదేపదే "ఏనిమిషమున కెట్లు వచ్చునో యెవ్వరు చెప్పగలరు? నాకిది తుదకుమేలుగనే పరిణమించునట్లున్నది" అని యనుకొనుచుండెను. భగవంతుని యాదేశము నెవ్వరు నిర్ణయింపగలరు.

రాత్రి పండ్రెండుగంటలాయెను లోకమంతయు నిశ్శబ్దముగ నుండెను. ఎచ్చటనో మాత్రము కొంచెము పర పర మను శబ్దమగుచుండెను. ఇంకొక యరగంటలో నాశబ్ద మాగిపోయెను. అగ్గిరాముడొక్క పెట్టున పై కెగరి యాగదిలోని కిటికీనెక్కి గోడపైనున్న యింటి కప్పు నెత్తివైచి పైకురికెను జైలులో కలవరము గలిగెను. అగ్గిరాముడు కిటికీ నూడదన్ని పారిపోయెనని కనిష్టేబులటునిటు పరుగెత్తనారంభించిరి వారుదయమువఱకును వెదకిరి కాని వానిజాడ యెందును గనుగొనలేకపోయిరి పదిగజముల దూర మెడమున్న తుపాకిబారినుండి తప్పించుకొని పారిపోవగలనను అగ్గిరాముని ప్రతిజ్ఞ నెరవేరెను. అగ్గిరాముడంతటితో మాయమైపోయెను. తిరిగి యాతడు నేటివఱకును గనబడకుండ లోకముయొక్క కన్నులను మూసివైచెను. ఈతడె నిజమైన అగ్గిరాముడు ఆనామమును ధరించిన ప్రతిదొంగయు నాచోర చక్రవర్తితో సమానుడు. నిజమైన యగ్గిరాముడాఖైదునుండి వెలువడిన యుత్తరక్షణముననే, తనచోరావతారమును చాలించెను.

"దాసూ! కొండడు చనిపోయినాడని యిన్ని దినములనుండియు విచారించుచుంటిమి కాని, నేటికి మనకొక క్రొత్తకొండడు లభించినాడోయి! సందిట నదిమిపట్టితినని నీపై నాతనికి కోపములేదు, లెమ్ము ఏమనెదవు కొండా?" క్రొత్తకొండడు తనయదృష్టవశమున విశ్వనాథము సేవలభించినదని సంతసించుచు, నాతనిపాదములపై వ్రాలెను. విశ్వనాథ మాతని లేవనెత్తి.

"ఇక నీపూర్వపుజీవనము నెల్లమఱచి, నూతనుద్యోగమున నభ్యుదయము నొందెదవుగాత" అని యాతని ప్రేమపూర్వకముగా దీవించెను.

సమాప్తము

(దొంగరాముని గురించి వేరొకగ్రంథమున దెలియజేయబడును)



శ్రీ కొండపల్లి ప్రెస్, రాజమండ్రి.